# దేవుళ్లు ఉంటారు ...జాగ్రత్త!

దేవుడు ఉన్నాడో లేడో గానీ
దెవుళ్ల చేత కూడా అద్భుతాలు చేయించగల
అపూర్వ వ్యక్తులీ మానవసమాజంలో ఉన్నారు :
మీరలాంటి అద్భుత వ్యక్తుల్ని కలుసుకో గోరు
తున్నారా? అది చాలా సులభం
*'చతుర' మిమ్మల్ని వారివద్దకు తీసుకు వెడుతుంది
వారి మాయా ప్రపంచాన్ని మీకు పరిచయం
చేస్తుంది వారి అపూర్వ మేధా శక్తికి మీరు
ఆశ్చర్య చకితులయేలా చేస్తుంది*

మార్చి సంచికలో ప్రసిద్ధ కన్నడ రచయిత
బి వి వైకుంఠరాజు కలం నుండి వెలువడిన
అపూర్వ నవల ఉద్భవం' ఈ అద్భుత చతుర
ప్రపంచానికి దర్పణం 'చతుర' సమర్పిస్తున్న
తొలి అనువాద నవల ఉద్భవం' కొత్తదనం కోరే
తెలుగు పాఠకులకొక వినూతన కానుక

# చతుర

*132 పేజీల పత్రికలో ఒక సర్వ సమగ్ర
నవలతో పాటు మినీ కథలు, చతుర ప్రపంచం
వంటి మరెన్నో అదనపు అలంకారాలు రంగుల
ఆఫ్‌సెట్ ముద్రణతో కేవలం
125 పైసలకే
లభ్యమవుతోంది
చతుర*

ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే
నవనవలా వేదిక 'చతుర'



Marketed By
Margadarsi Marketing
PRIVATE LIMITED
Eenadu Compound,
Hyderabad-500 004

# బ్రూ-కమ్మని రుచికి, సువాసనకి మొదటి రకము

## దక్షిణ భారత దేశంలోని కాఫీ అభిమానులను అడగండి. మీ పొరుగు వారిని అడగండి.



సుశీలా రవీంద్రనాద్, ఇల్లాలు.
మా కుటుంబం బ్రూ కు అలవాటుపడింది. అందుకే గాక నా బడ్జెట్ కు కూడా సహకరిస్తుంది



విజయ కుమార్ రావు, క్రికెట్ ఆటగాడు.
గ్రౌండు కాఫీ సువాసనను మరేదీ ఎదిరించ లేదు, అందుకే బ్రూను కోరుకుంటాను.



శ్రీ మరియు శ్రీమతి హరిశంకర్, నూతన దంపతులు.
మేము ఇష్టపడేది సారమైన కాఫీ అయితేనే — బ్రూ అనుకూలమైనది కూడా.



శ్రీ. కృష్ణమూర్తి, ప్రిన్సిపాల్.
దబరాతో పొగలుకక్కే రుచికరమైన, సారవంతమైన కాఫీనే ఇష్టపడతాను.




**బ్రూ—దాని వెల ఎంతో ఆకర్షణీయమైనది**
**ఏ కాఫీ అభిమానిని అయినా అడగండి**

OBM 6709A/1 TEL

— లోకంపోకడ ✱ ఊమెన్ —














**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 9-3-'79

**సంపుటము 72 : సంచిక 26**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

✱

పోస్టులో ఏడాది చందా రు. 41–60
ఆరు మాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 15 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక



## ముఖచిత్రం

26 1 79 వ తేదీ మీ (మా)సచిత్ర వార పత్రిక ముఖచిత్రం లత చేతిలో బజ్జీలతో ప్రేక్షకులకు నోరూరిస్తున్నట్లు ఎంతో ఆకర్షణీయంగా వుంది జీవితమాధుర్యం సీరియల్ చాలబాగుంది "గవర్నెస్ కరుణ" కథలు కూడా బాగున్నాయి.

పి. సుజాత, కె లక్ష్మీకాంతమ్మ, ఇ ఇందిర (ముదిగుబ్బ)

## బొమ్మల మహాభారతం

మీరు పత్రికలో ప్రచురిస్తున్న బొమ్మల మహాభరతం చాలా ఆసక్తికరంగా ఉంది మా పిల్లలు ఆ బొమ్మల్ని కత్తిరించి ఆల్బమ్‌గా చేసుకుంటున్నారు. ఇది పూర్తిగా ప్రచురించ గలరని ప్రార్థన

పులిపాక వేంకట లక్ష్మీకాంతారావు, (హైద్రాబాద్)

## గేయాలు

9—2—79 సచిత్ర వారపత్రికలో కాంతి కిరణాలు గేయంలో విప్లవాత్మకంగా ఉద్వేగంతో ఒక భావాన్ని స్పష్టంగా వివరణ చేయబడింది ఎదురు రచయిత స్వార్థం చీకటితో కలిస్తే కాంతి కిరణాలు అనే యువకుల ఆశయము దానిని రు పమాపినై. కసాయి ప్రభుత్వ కిరాయి బంట్ల దుర్మార్గాలు రచయితగారు చక్కగ వర్ణించారు

ఎ పూర్ణచంద్రరావు, (విశాఖ)

## సీరియల్

శ్రీ గంటి వెంకటరమణగారి గవర్నెస్ కరుణ సీరియల్ ఉత్సుకతత, అద్భుతముగా సాగినది కథ మేము అనుకోని విధముగా మలుపులు తిరిగి చివరకు సుఖాంతము అయినది. ఇందులో భర్య ఎవరినో ప్రేమించి



అతనితో వెళ్లిపోవడము, ఆ బాధతో భర్త చనిపోవడమూ, పిల్లలు అనేక కష్టాలు పడి చివరకు వుద్యోగాలు చేసి సుఖపడటము చాలా బాగా చిత్రించిరి. కె. యస్ శేఖర్, (ఖమ్మం.)

* * *

9—2—79 పత్రికపై కవిత ట్రిమ్‌గా కనిపించింది గవర్నెస్ కరుణ ముగింపు బాగుంది.

డబ్బీరు ఉదయకుమార్, (కుర్దారోడ్)

## కథలు

గుండు సుబ్రహ్మణ్య దీక్షితులు గారి శేషయ్య శిష్యరికం కథ అనేక వాస్తవాలతో చాలా బాగుంది పౌరోహిత్యం ఎంత ప్రమాద మైనదో రచయిత చాలా బాగా చెప్పారు.

గొల్లపూడి గౌరీశంకరశాస్త్రి, (విశాఖపట్నం)

* * *

26—1—79 సంచిక అస్పష్టమైన రీతిలో.. అందంగా మలచబడి అందించబడినా, నూతన ప్రక్రియలతో పరవళ్లుతొక్కుతూ కదలిపోవాలని అభిలాష— క్రిటికల్‌గా ఆలోచిస్తే, ఆకర్షణ— వ్యామోహం— లాటి సీరియల్స్.. రీడర్స్. ఆలోచనలను ఆమడ దూరంలో కూర్చొని ఆలోచింపచేస్తుంది.

కనకాభిషేకాలు — శైలి... కథ ఫినిషింగ్ టచ్ ట్విస్ట్‌తో అభియుక్తంగా ఉంది. రచయిత్రిగారికి నా అభినందనలు.

ఏదిముఖ్యం?.. చివరకు అంటే... లోక్లాస్‌గా భావించబడుతున్న.. అప్రెండ్ పీపుల్‌కు తిండిముఖ్యమా? బట్ట ముఖ్యమా? అనే భావనను — నాగరత్నం ద్వారా కాకుండా — లచ్చి ద్వారా ఆ భావాన్ని అనువయిస్తే.. బాగుంటుందని అభిప్రాయం. కవర్ పేజి.. నైస్

పసుపులేటి జయంత్‌కుమార్ [సిరిసిల్ల]

* * *

9 2 79 సంచికలో శ్రీ గుండు సుబ్రహ్మణ్య దీక్షితులు వ్రాసిన శేషయ్య శిష్యరికంలో నేటి సమాజంలో బ్రాహ్మణుల స్థితిగతులను వారి నిత్య జీవిత పోరాటాన్ని చక్కగా ప్రతిబింబింపజేశారు

తల్లాప్రగడ గోపాలకృష్ణ, (ఏలూరు)

* * *

సైన్సులో సరదాలు గూర్చి డా. మహీధర నళినీ మోహన్‌గారి కోడిగుడ్డుతో తమాషాను చదివి కొన్ని విషయాలను తెలుసుకొన్నాము

ఎస్ తిరుపతిస్వామి, వేములవాడ.

* * *

"తాళ్లూరి రామేశ్వరి" ముఖ చిత్రం ఎంత చక్కగా ఉందో కథలు గూడ అంత చక్కగా ఉన్నాయి.

బి. శ్రీమన్నారాయణబాబు, (ఆత్మకూరు)

## ఇండికా – శటీవా

గుడివాడనుంచి డా. దత్‌గారు "కెన్నబిస్ ఇండికా" ని గురించి రాశారు. కన్నబిస్ ఇండికా, కన్నబిస్ శటీవా ఒకే చెట్టు పేరులు అని ఇండియన్ ఫార్మకోపియా, ఇండియన్ మెడిసినల్ ప్లాంట్స్ వగయిరా పుస్తకాలలో ఉంది.

గంటి రామలింగం, మదరాసు.



*(గత సంచిక తరువాయి)*

స్కూలులో పాఠా నిజంగా పారంభించేసమయానికి 'అర్జెంటుగా రమ్మంటున్నారండీ కరణంగారు'' అంటూ పోలిగాడు వచ్చాడు.

" స్కూలు కాపీ వస్తాను " అంది ఇందిర. పిల్లలంతా యిప్పుడిప్పుడే చెప్పేది వినేస్థితిలోకి వచ్చారు. అర్థాంతరంగా వెళ్ళి పోవడం యిష్టంలేదు ఇందిరకి

''లేదమ్మగారూ ! పెద్దలంతా వున్నారు. తమరొస్తే మాట్లాడాలంట'' పోలిగాడి మాటలో కాస్త హెచ్చరిక ధ్వనించింది.

''బేటీ ! నువ్వెళ్ళిరా. నే నిక్కడే వుండి పిల్లకేదేనా కథ చెప్తాయిలోగా !'' చెప్పాడు బాబా !

''సరేపద చూడండి పిల్లలూ ! బాబా మాట వినాలి.'' అనిచెప్పి పోలిగాడి వెంట బయలుదేరింది ఇందిర

నిజమే! చావిడినిండా మనుషులే చాలా తీవ్రంగా చర్చలు జరుగుతున్నాయి – దేన్ని గురించో అర్థం కాలేదు ఇందిరకి.

అరుగు మీదకి అడుగు పెడుతూ ''నమస్కారం'' అంది అందరినీ ఉద్దేశిస్తూ.

ఏదో ఉరమని పిడుగు, వారి మధ్య పడ్డట్టు స్తంభించి పోయారు ఓ క్షణం సేపు.

''రామ్మా...!...రా! నువ్వేనా కొత్త టీచరువి!'' అందరికంటె కాస్త రీవిగా కూర్చున్న ఓ పెద్దమనిషి పలకరించాడు ఇందిరను.

''అవునండీ! పిలిపించారట! అసలు నేనే రేపు సెలవు రోజన వద్దామని అనుకుంటు న్నాను. ఇదీ మంచిదే అయింది'' అంటూ ఖాళీగా ఉన్న ఓ కుర్చీలో కూర్చుంది. సభ్యత తెలియని మనుషులని తెలిసిపోయాక, కూర్చోమనలేదని అనుకోడం దండుగ అను కుంది ఇందిర.

''ఏమిటీ! వారం కాలేదు వూరులో గాలంవేసి గాలిస్తున్నావట ఫ్యాన్ కోసం, అయాకోసం!'' నవ్వుతూనే అడిగినా, ఆ ప్రశ్నలో వ్యంగ్యం బాగానే గ్రహించింది ఇందిర.

''చిత్రం– స్కూల్లో టీచర్లు మారి పోతున్నారేగాని, అయాలూ, ఫ్యానులూ నారిపోడం లేదుగదా– టీచరంటూ లేక పోయినా ఏదో ప్రేమలో కాస్త స్కూల్లో

పంటలు దూరాయా? గొడ్లు నిద్రకోరుగుతున్నాయా చూడాలా వద్దా! పెద్దవారు మీరే చెప్పండి" ఎంతో నమ్రత ఉట్టిపడుతూ అడిగింది.

మీసంమీద చేయివేసి "చూశావటయ్యా పట్నంపిల్ల జోరు?" కరణంగారు మునసబు గారిని అడిగారు.

"దీంట్లో జోరూ, పోరూ ఏం లేదు కరణంగారూ! బడి మీరందరిదీ. అంతా పెద్దలు. మీకు నేను చెప్పగలదానిని కాదనుకోండి. అయినా ఒక్కసారి ఆలోచించండి. స్కూల్లో బల్లల్లేక, పిల్లలక్కడి పుస్తకాల (గొంతుక్కున్నాయి. కానీ వాళ్ళకేం లేవు. ఇక మాలవాడలోంచి ఒక్కగానొక్కరుకూడా స్కూల్లోకి రావడంలేదు. ఇవన్నీ మీ దృష్టికి ఏ టీచరూ తీసుకురాకపోవడం ఆశ్చర్యంగా లేదూ!"

"అంతకాలం ఉండేట్టుందెవరటా?" జేబులోంచి చుట్టతీసి కొనకొరికి నోట్లో పెట్టుకున్నాడు మునసబు. పోలిగాడు తక్షణం అగ్గిపుల్ల గీశాడు. ఇందిరకి కోపంతో పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"మీ పెద్దలు దయతలిచి వుండనిస్తే గదా, యిక్కడ టీచరేనా వుండకల్లేది? అయ్యో! స్కూలుకి ప్యూను, ఆయా తక్షణం కావాలి. అవి ఏర్పాటు చేయించండి ముందు. స్కూలు బల్లలు ఎక్కడ ఉన్నాయో అవి పంపించండి ముందు. అదే పదివేలు." అంది చాలా ఆవేశంగా.

"తరవాత?"

"తరవాత?" చిరునవ్వు నవ్వింది ఇందిర—"వూళ్ళోవున్న ప్రతిబాలుడూ బాలికా స్కూలుకు వచ్చేలాచేసేపని నాది." అంటూ లేచి నిలబడింది.

"మేం పిలిపించింది నీ మాటలు విని పూరుకుందుక్కాదమ్మాయి... మేం చెప్పేనవి నీవు వినడానికి."

"అవీ వింటాను చెప్పండి."

"ఈ నెలాఖరుదాకానే స్కూలు. తరవాత పాక కాస్తా ఖాళీచేయాలి. వేలం వేస్తున్నాయి. చాలాదడ్డపని ఉంటుంది. కునూరు చేపల వేలం అంటె నీకు తెలియదులే—చాలా ముఖ్యమైనది. ఇంత మంచినీళ్ళ చెరువూ, చేపల పంటా యీ ప్రాంతాల యింకో చోట లేదు..." కరణంగారు చెప్తుంటే ఆశ్చర్యంగా వింది ఇందిర.

# కోటిగాడు

సీరియల్.....

కె. రామలక్ష్మి

"దానికీ బడికి ఏం సంబంధం? మీ కచేరీ చావిడి లేదా? పక్క ఊళ్ళో పంచాయతీ ఆఫీసు లేదా? స్కూలు మూయడం దేనికి? నా-కర్థం కావడంలేదు" వింత పడుతూ అడిగింది ఇందిర.

"అదంతే- ఈ వూరు కట్టుబాట్లు వేరు, వ్యవహారాలు వేరు... నువ్వెళ్ళమ్మ" కరణంగారన్నారు.

"అమ్మాయి! నీ మంచికోరి చెప్తున్నా. అలగాజనాన్ని స్కూల్లో చేర్చుకు— అది కుదిరేపనికాదు" హెచ్చరించాడు మునసబు.

"మీరు స్కూలు మూయమంటే, నేను చెట్టు కింద కూర్చోబెట్టి పాఠం చెప్తా. అయినా డి. ఇ. ఓ. గారు రాస్తారుగదా!"

"మనం రాయమన్నది రాస్తారాయన."

ఇందిర ఇక వినదల్చుకోలేదు. చరచర మెట్లుదిగి రోడ్డుమీదికి వచ్చింది. ఆమెకు స్కూలువైపు వెళ్ళబుద్ధి కాలేదు. వూరంతా కలయచూసింది. మహిళా మండలి బోర్డు చూసి ఆ యింటిముందాగింది. అదీ కరణం గారింట్లో భాగమే.

"అటు ముసలం ఇటు" అంటూ ఓ కంఠం వినిపించింది.

"ఎవరు కావాలి?" అడిగిందామె.

"ఈ ఊళ్ళో మహిళా మండలి ఏపాటి?" కుతూహలాన్ని తొక్కుకుంటూ అడిగింది.

"అదంతా తెల్లారుఝామున చలువ దగ్గరే!" కిసుక్కున నవ్వింది ప్రౌఢ.

"అంటే?!"

"అంతే కద. మరి పల్లెటూరికి కొత్తలా ఉన్నారు!" జాలి ప్రదర్శించింది.

"కానీ మీలాంటి వారంతా సహకరిస్తే ఏమైనా చేయవచ్చును గద!"

"ముందా పిల్లల పదిరోజులు స్కూలుకి వరసగా వచ్చేలా చూడమ్మా తల్లీ! వారంలో మూడు రోజు లుండదా టీచరు. పిల్లల పోరు భరించలేకుండా వున్నాం" కసిరిందామె.

ఇక మాట్లాడకుండా స్కూలు చేరింది ఇందిర. అప్పటికే బాబా పిల్లల్ని పంపించి టీచరమ్మ కోసం వేచి చూస్తున్నాడు. వాడి పక్కనే వీరాయి కూర్చుని ఉన్నాడు.

"అందరూ నన్నెట్టుకోమన్నారండి ప్యూనుగా" లేచి నిలబడుతూ చెప్పాడు వీరయ్య.

"అసలువాడివి నువ్వుకాదా!"

"కాదండి! పోలిగాడూ వుంటాడండి కావలిస్తే."

ఇదంతా అయోమయంగా ఉంది ఇందిరకు. "ఇంతకీ జీతం ఎవరికి ముట్టుతోంది?" నవ్వుతూ అడిగింది.

"జీతాలెందుకండమ్మాయిగోరూ! మేమంతా వెట్టోళ్ళమేగా" తలగోక్కున్నాడు. ఇదేనా చెప్పవచ్చో చెప్పకూడదో తెలీలా.

"సర్లే! నువ్వు సాయంత్రం దాకా నేను

---

**జరిగినకథ కి:** అగ్రహారం కరణం కూతురు మహాలక్ష్మి, వెట్టివాడి కొడుకు కోటిగాడు చిన్నతనం నుంచే కలిసిమెలిసి తిరుగుతూంటారు. ఓనాడు మహాలక్ష్మి బలవంతం మీద ఆమెకు ఎంగిలి పెడుతున్న కోటిగాడిని చావబాదుతాడు కరణం. ఆయన బావమరిది కృష్ణుడు పంతులమ్మలను వేధిస్తూంటాడు. కొత్తగా ఆ వూరికి పంతులమ్మగా వచ్చిన ఇందిరను కృష్ణ బలవంతం చేయబోగా, కోటిగాడు పరోక్షంగా కాపాడుతాడు. తనకు తోడుగా ఉండటానికి బాబాను పంపిన కోటిగాడిని, బడిలోచేరి చదువుకోమంటుంది ఇందిర.

---

ఈ ఊరి హరిజన వాడకెళ్ళాలి." అంటూ లోపలికి వెళ్ళిపోయింది ఇందిర.

"అమ్మబాబోయ్! అమ్మాయిగోరూ! వెలేసేస్తారండీ!" గట్టిగా అరిచినంత పని చేశాడు వీరాయ్.

గడపదాట బోతున్నది కాస్త ఆగి "నేనే వాళ్ళను వెలేస్తాను వీరయ్యా!" అంది నవ్వుతూ.

చిన్ననవ్వు గుబురు మీసాలచాటున కనబడి మరుక్షణంలో మాయమైపోయింది.

"చిత్తం! వస్తానండమ్మా!" అని ఉత్సాహంగా వెళ్ళాడు. బాబా నవ్వుకున్నాడు —కాస్త అభిమానంతో కూడిన పలకరింపు యీ బడుగు ప్రాణాలని ఎంత కదిలిస్తుంది! అనుకున్నాడు.

అంతా పనులు ముగించి యిళ్ళకు చేరే సమయానికి హరిజనవాడలో కోటిగాడిల్లు చేరింది ఇందిర. అప్పటికే, ఇంటో అంతో ముక్కేసుకుని వచ్చినవాళ్ళ కబుర్లతో అంతా గోల గోలగా వుంది.

" అమ్మగోరూ! దండాలండి! వీంకడిల్లదిగో— ఆ కునుకుదీపం ఉందే- అదేనండి— యింకా కొంప చేరినట్టు లేడండి" తాగి వున్నాడేమో — చాలా ధైర్యంగా మాట్లాడుతున్నాడు పోలిగాడు.

"పదరా— నువ్వు పద" అంటూ అటు వైపు వెకవెక నడవడం ప్రారంభించింది.

ఆ కునుకు దీపం ఒంటరిగా లేదు. దాని పక్కనే కునుకుతూ కోటిగాడున్నాడు! వాడి కింకా ఆశ చావలేదు - టీచరమ్మ వస్తారా? రారా? అన్న ప్రశ్నని పదేపదే అటు నుంచి ఇటు, ఇటు నుంచి అటు తిప్పి తిప్పి వేసుకుంటూ నిద్ర కొరిగి పోతున్నాడు. పోలి మావ గొంతు దగాయించినట్టు వినబడ్డంతో చిక్కడి నిద్దర అక్కడే ఎగిరి చక్కా పోయింది నిటారుగా కూర్చున్న వాడి కళ్ళకు ఆ చీకటివాడలో వెలుగు దేవత నడిచి వస్తున్నట్టుగా— టీచరమ్మ కన్పించింది. "అమ్మోవ్! నే చెప్పలేదంటే! అదిగో టీచరమ్మ వస్తున్నది" అంటూ వంట పొయ్యి దగ్గర కునుకుతున్న తల్లి మీదకెళ్ళి పడ్డాడు అమాంతంగా!

"ఏట్రా యీ పిచ్చి" విసుక్కుంటూనే లేచి నిలబడింది. బుడ్డి దీపాలు కాస్త పెద్దవయ్యాయి

"అయ్యబాబో! తమరేనా? నిజమేనన్న మాట!" అంటూ నవ్వుతూ పాకముందు నిలబడిన ఇందిరని చూసి అడిగింది నూకాలు.

"తమలాటోళ్ళు రాడం దేనికమ్మా! మీరుకాన రమ్మంటే లగెత్తుకు రామా?" ఏం చెయ్యాలో, ఎక్కడ కూర్చోమనాలో తెలియక నానా ఇబ్బంది పడిపోతూ అంటూనే ఉంది నూకాలు.

"ఆసి పిచ్చి ముఖమా! వచ్చేసి నాకనా — చాపతెచ్చి పరు" పురమాయించాడు వీరయ్య.

"నేను రా అని పిలిచినా మీరు రారని తెలుసు నూకాలూ! అందుకే నేను వచ్చాను" అరుగుమీద చతికిలబడుతూ అంది ఇందిర.

ఈ వార్త వాడంతా పాకేసింది. "బ్రాహ్మణమ్మలా ఉన్న టీచరమ్మ కోటిగాడి కొంపకి రావడమేంటి" ఓట్లు రోజులైనా యింత వుండదే — అనుకుంటూ ఒకళ్ళూ అరాగా గుంపు పోగయ్యారు.

ఇందిరకిలా ప్రచారంలాగా, తను చెప్ప దలుచుకున్నది చెప్పడానికి సంకోచంగానె వుందిగాని, తప్పదు.

"చూడు! నీ మొగుడేడీ? యింకా రాలేదన్నమాట!" నూకాలుని సూటిగా అడిగింది.

"వస్తాడమ్మగోర్లూ ... తమరి కాడికి రమ్మంటాను గంద. అయ్యబాబూ! కోటిగాడు చెప్తే నాను నమ్మలేదండీ!" నల్లని ముఖంలో దాని కళ్ళు మిలమిల మెరిసిపోతున్నాయి. "వాడుట్టి వెధవసన్నాసండమ్మా...నా కడుపున పుట్టవలసినవోడు కాదు—చదవాలంటాడు!" నవ్వుతుంది.



# ధర్మపథం

— బులుసు వెంకటరమణయ్య

## పరిసరాల ప్రభావం

చెడ్డ స్వభావం కలవాడు ఉత్తముడుగానూ, యోగ్యుడుగా ఉన్నవాడు అయోగ్యుడుగానూ మారరని చెప్పలేము. పరిసరాలను బట్టి వారిలో మార్పు కలుగుతుంది. దీనిని బట్టే "ఆరు నెలలు సహవాసం చేస్తే వారు వీరౌతారు" అనే సామెత వచ్చింది. సహవాసంవల్ల మంచి చెడ్డలు వస్తాయి. దుష్టసహవాసంవల్ల మంచివారు దుష్టులుగా మారవచ్చు. మంచివారి సాహచర్యంవల్ల దుష్టుడు మంచివాడుగా మారవచ్చును. పరిసరాల ప్రభావం అటువంటిది!

ఎంత దృఢమనస్సు కలవాడయినాసరే— ఏట్టి చెడ్డ అలవాట్లు లేనివాడైనా సరే కల్లు తాగేవారి మధ్య తిరుగుతున్నప్పుడు — మొదటో కాకపోయినా కొంత కాలానికైనా ఆ అలవాటు వస్తుంది. దానిని తప్పించుకోవడం సాధ్యం కాదు. ఏట్టి విజ్ఞానికయినా ఇది తప్పదు. దీనిని బట్టియే "బలవానింద్రియగ్రామో విద్వాంస మపికర్షతి" అనే హితవాక్యం ఏర్పడింది. మనస్సువెనక్కి లాగినా, యింద్రియాలు ముందుకు లాగుతూ ఉంటాయి.

ఈ విషయాన్ని తెలుసుకునే మన మహా మునులు, నగరాలనూ, గ్రామాలనూ, వాటి సమీప ప్రదేశాలనూ విడిచి క్రూరమృగాకీర్ణాలైన మహాటవులలో ఆశ్రమాలు కల్పించుకుని, అక్కడే స్థిరపడి తమ ఆధ్యాత్మిక సాధనలను సాగించేవారు. జనులు ఉండే స్థలాలలోనూ, వారికి అందుబాటులో ఉండే చోట్లలోనూ ఉంటే వాళ్లతో పరిచయం కలిగే తీరుతుంది. వాళ్లు సమర్పించే మధుర పదార్థాల మీదికీ, ఫలాల మీదికి మనస్సు పోకతప్పదు. వాటి ఆకర్షణవల్ల సాధన దూరమౌతుంది. అడవులలో ఉంటేనా — ప్రజలక్కడికిరారు. మనస్సు వేటిమీదికీ పోదు. శరీరధారణకు రుచిగా ఉండని ఫలాలూ, మూలాలూ సరిపోతాయి. తామున్న పరిసరాలనుబట్టి తమ సాధన కొనసాగుతుంది.

అరణ్య జీవితానికి అలవాటు పడినవారు నగర వాసులను చూచి శుచి అయినవాడు ఆ శుచి అయినవాడిని ఏవగించుకొన్నట్లు, స్వేచ్ఛా విహారి బంధనంలో ఉన్నవారిని చూచినట్లు నిరాదరణనే వెల్లడిస్తారు. వారికి జనులతో నిండియున్న ప్రదేశం నిప్పు అంటుకొన్న గృహంవలెనే కానవస్తుందని మహాకవి కాళిదాసు శాకుంతలనాటకంలో "జనాకీర్ణం మన్యే హుతవహ పరీతం గృహమివ" అని ఎంతో స్వాభావికంగా వర్ణించాడు.

మానవులపైని పరిసరాల ప్రభావం బాగా పనిచేస్తుంది. బాగుపడడానికిగాని, చెడిపోవడానికిగాని పరిసరాలు ముఖ్య కారణం. పరిసరాల విషయమై భద్రత ఎంతో అవసరం ★

---

"చదవాలనడమేమిటవే ? చదువుకోవాలి. లేకపోతే, యిలా విన్నావా — నీ మొగుడు చేసిన దానికి తరువాయిగా వీడూ పాలేర్లై బతకాలని రాసి వుందేమిటే—నీ పిచ్చిగాని" ఇందిర నవ్వింది.

చాలామంది ఆడోళ్లు ఆమెకి కాస్త దగ్గరగా చేరారు. "అయితే మాబొట్టెలకీ, బొట్టోళ్లకీ కూడా ఆ చదువులొస్తాయా టీచరమ్మా !" ఒకత్తె కాస్త ధైర్యంచేసి అడిగింది.

మంచీ చెడూ మాట్లాడుతూ ఎన్నో విషయాలు వివరించింది ఇందిర. గవర్నమెంటు మీకోసరం ఎన్నో సదుపాయాలు చేస్తూంది. మీరెందుకు వెనక లేస్తారు. చూడండి. మీ కుర్రాళ్లు కూడా రేపటి నుంచి బడికి రావాలి. లేకపోతే, ఆయా కాదు, నేనే వస్తాను తీసుకువెళ్లడానికి" నవ్వుతూనే బెదిరించింది.

"మరిటు కామందుల పనులెల్లా గండమ్మా ! ఆరూరుకోరు !"

"పసివాళ్లను పనులలో పెట్టుకోడం తప్పు. అంతేకాదు. జీతం బత్తెం లేకుండా పనులు చేయించుకోడం కూడా నేరం. తెలుసా ?"

"అవన్నీ చదివితేకదా తెలిసేది! మీలో మీ పిల్లలనేనా చదివించుకోవాలన్న బుద్ధి కలక్కపోవడం మహా దారుణం నూకాలూ! నీ కొడుకు పాలికాడే అవ్వాలనా నీ కోరిక?"

"లేదండమ్మగోరూ! లేదులేదు... అమ్మగోరూ! వాడు బాగుండాల. ఇలా బతుకు వాడకొద్దు. కానీ ఎలా? పుట్టుక పుట్టేసి నాక రాతెవరు తప్పిస్తారండమ్మా ? పాలికాపు కాకపోతే సేద్యగాడైనా బాగుంటుందని పిస్తుంది. కాని ఎలా? భూకామందు దయ తలవాల. కౌలివ్వాల. అది చేసుకోవాల. అదెలా చేసుకొంటాడమ్మా! కామందు పొలంపని చేయాలిగందా!" స్వగతంగా తన ఆలోచనల ఎదురుబొదురు తరంగాల తాకిడులని చెప్తుంది నూకాలు

"ఏటే పంచాయతీ! నామీదే" దగ్గరకి వచ్చేదాకా ఎవరున్నదీ కనబడని వెంకన్న పెళ్లాంమీద అరిచాడు.

"చూడండమ్మా! ఆ ముక్క లేకపోతే కొంపకేరాడు. ఇంటికాడికి పోవాలన్న ధ్యాసకంటే— కల్లుపాక కాడకనే చస్తాడెంత సేపూ! వాడు ఏం చేస్తాడమ్మా! ఏం చెయ్యలేడు" కసిగా కోపంగా అంది నూకాలు.

"అందుకేగదమ్మ మా బతుకు లిలా తెల్లారాయి..." వస్తున్న ఏడుపుని దిగమింగుకుంటూ కళ్లొత్తుకుంది నూకాలు. ఆ చీకట్లో సిరు కమ్మిన దాని కళ్లలో వింత అజీర ఏర్పడింది. ఓ కంట కన్నీరు. ఓ కంట కరిమంటలాగా వుంది దాని ముఖం.

"వెంకన్నా! నేనెవరో తెలుస్తోందిరా?"

"దండాలు టీచరమ్మా! వీరాయికి చెప్పాడంట పోలిగాడికి తెలుసునంట..."

"ఏమని?" సమాధానం ఏం వస్తుందోనని భయపడుతూ ఎదురు చూసింది.

"అదేటండీ ! మీరు టీచరమ్మంట, మాల మాదిగోళ్లంతా బళ్ల కెళ్లి తీరాలన్నారంట. బలే— బలే. పొలం పన్లు ఉగ్గం ఆగిపోతాయి కద — ఆ మాసులతో"—

"రేపణ్ణుంచి నీ కొడుకు బడికి రావాలి. వాడితోపాటే ఇక్కడి పిల్లలంతా రావాలి. అది చెప్పిపోడానికే వచ్చాను" లేచి నిలబడింది ఇందిర

"చిత్తం ! పెదబాబు చెవిన కాస్త యీమాటవేసి... ' నసిగాడు వాడికి తాగిన నిషా దిగిన ఎవరో కొట్టినట్టు దిగిపోయింది.

## కోటిగాడు

"ఛీ! నీ కొడుకుని బడికి పంపించుకుంటున్నందుకు పెదబాబు చినబాబు సరసాలా? సిగ్గులేదూ."

"చిత్తం. అయినా వారుప్పతింటున్నాం కదండీ! ఓ మాట సెప్పకపోతే మాటొస్తాదని భయంకదమ్మా!" వీరాయి వెంకన్న తరఫున బదులు చెప్పాడు.

"వీరాయి! వారి పొలాలుదున్ని పండించేది మీరు. బస్తాల కెత్తేది మీరు. మరి వాళ్ళు మిమ్మల్ని అడిగే చేస్తున్నారా వాళ్ళ పన్లు...మీరిలా చెప్పుకింద పడివుండండి— కొన్నాళ్ళకి మీకంటే జంతువులే నయంఅని మీకే అనిపిస్తుంది."

"చిత్తం. ఇప్పుడుమటుకు? అంత కంటేనా? అమ్మగోరూ! ఏం మాట రాదండీ! కోటిగాడ్ని నే పంపుతానమ్మా... ఆ చదువువల్ల ఏం లాభమో నష్టమో నాకేంతెల్వదుగాని, వాడికి ఏదో అయిపోవాలనుంది. అది తెలుసు..." ఎంతో సంతోషంగా నూకాలు భుజంతట్టింది ఇందిర. అది కుంచించుకు పోయింది. "దివరిలా చేస్తే తిడిలేస్తారమ్మా! యీ వూరు మాయదారి ఊరు." వినీవినబడనంత నెమ్మదిగా అంది.

"మీరంతా నాపక్కనుంటే, నే నెందుకు పారిపోవాలి? రారా వీరాయి" అంటూ వచ్చినదారినే చెక చెక తిరుగు ప్రయాణం ప్రారంభించింది ఇందిర.

* * *

ఎప్పుడు నిద్రపోయాడో తెలీదు. కోటిగాడు నిద్రలో అలా సలవరిస్తూనే వున్నాడు. వాడు వూహాలోకాల్లో తేలిపోతున్నాడు. ఇన్నాళ్ళూ దూరంలోంచి చూసి ఆనందిస్తున్న విందు తనముందు కెవరో "ఇంద" అని తోస్తున్నట్టుంది వాడికి. వాడికి వూహ తెలిశాక తొలిసారి రొటీన్ తప్పాడు — చెరువుకేసి పరిగెత్తలేదు. "అమ్మోవ్— భద్దెట్టు" అంటూ ఇంకా వెల్గు రాకుండానే— నూకాలుని వేధించడం ప్రారంభించాడు. వాడి ఆతృతకి నవ్వొస్తుంది ఆ పిచ్చి తల్లికి. ఆమె కెంతో సంతోషంగా ఉంది, తన కొడుకు చదువుకుని పైకి రావాలంటున్న యింకో ఆడది కన్పించేసరికి.

"అబ్బ చాల్లేవే. నాకు మంచి చొక్కాయివ్వు. పలకా బలపం కావాలి..."

"అవన్నీ అయ్యగార్నడిగి సాయంత్రానికి తెస్తాలే కోటీ... ముందు అయ్యగార్కి దండమెట్టుకుని పోదువుగాని—అమ్మాయిగారొస్తారుగంద పద పద" అంటూ పాక తలుపులు జేరవేసి పనిలోకి నడిచింది— కోటిగాడు తల్లివెనక నడుస్తున్నాడన్న మాటేగాని, వాడి మనస్సు అక్కడలేదు "బాబా యీపాటికి నమాజ్ చేసేసుకుని వుంటాడు. నాకు బాగా చదువు రావాలని ప్రార్థించి వుంటాడు. టీచరమ్మ కడిగిన ముత్యంలాగా సిద్ధంగా వుంటారు, పిల్లల రాకకోసం చూస్తూ ఎంత మంచి టీచరమ్మను పంపాడు—దేవుడు మా వూరికి!" అనుకుంటున్నాడు.

"ఏంటా కోటి! అలా నవ్వుకుంటున్నావు! జాగ్రత్త బాబూ! చదువులు పెద్దోళ్ల గొడవలు బాబూ! యీపూట మాటు—మనకి నవ్వదంటే చక్కా వచ్చేద్దువుగాని" అంటున్న అమ్మ మాటలు వింటూ వుంటే ఎప్పుడూ లేనిది కోటిగాడికి కోపంవచ్చింది "నువ్వేంటే— కష్టమైతేనేం? దూడల్ని మేపడం, కర్రలు మోయడం కష్టంకదా! నేను చదువుకుంటాను. ఎంత కష్టమైనా!" అంటూ తల్లిని దాటుకుంటూ గబగబ నడిచాడు ముందుకి.

"ఓరోరి! ఎంత పౌరుష మొచ్చిందిరా. బాబు గొడ్లచావిడి దగ్గరే వుంటాడు. అందరం పోయి దండ మెట్టుకుందాం" అంటూ యింటివెనకవేపు నడిచింది.

"ఏటైపె నూకి? అరె, ఏరోయ్! సంబరానికి ముస్తాబయినట్టున్నావు! ఏంటీకథ!" గడ్డిపిరి విప్పుతూ నవ్వుతూ అడిగాడు వెంకన్న.

ఒక్కక్షణంసేపు తండ్రి ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు కోటి.

"నానీపూట బడికి పోతున్నానయ్యా" అన్నాడు కోపంగా.

"నిన్నటి సంగతి నిన్నసే ఒగ్గేసుకుంటాడు నీ బాబు. లాగినోడి మాటకి విలువేందిలే, పదరా" అంటూ కొడుకు రెక్క పట్టుకుని ముందువాకిట్లోకి అడుగెట్టింది నూకాలు.

"వచ్చివచ్చావుటే బారెడు పొద్దెక్కాక"

"అమ్మగోరూ! కోటీశు బడికెడతాడంట." ఏదో తప్పు చేస్తున్నట్టు అడిగింది నూకాలు.

"ఏవిటే యీ చోద్యం!" భ్రాంతపంచంలో తొలిసారి ఎప్పుడూ వినని వింతవార

విస్తుట్లా బుగలు నొక్కుకుంటూ అలాగే నిలబడి పోయారు సూరమ్మగారు.

"టీచరమ్మగారంపించ మన్నారండి. తవరి కాళ్ళకి దండం పెట్టి పోతాడండి" భయపడుతూనే చెప్పింది నూకాలు. ఈవిడే ఇలా అంటే, యింకసలు కరణంగారు మళ్ళీ కంచీ తీస్తాడని నూకాలు భయం.

"చాల్లేవే నూకాలూ. చదివి గొడ్డు కాస్తే అవేం పాలెక్కువిస్తాయటే" లోపలికి చక్కాపోయారామె.

"కోటీ! ఎందుకొచ్చిన గొడవరా!" అన్న నూకాలు మాట పూర్తికాలేదు — కోటిగాడు పరుగు లంకించుకున్నాడు. "కోటీ-ఒరే ఆగరా" అంటున్న తల్లి మాట వాడికి చాలా అసహ్యంగా వినిపించింది తొలిసారి.

'పిదప రోజులూ, పిదప బుద్ధులూ విన్నారా ఇది?" అంటూ భర్తకి కాఫీ గ్లాసుతోపాటు కోటిగాడి స్కూలు వార్త కూడా అందించారు సూరమ్మగారు. అసలే కాస్త కారం తిన్న కోతిలా వున్న కరణం గారి మనస్సుకి వార్త యింకాస్త చిర్రెత్తించింది.

"ఏమిటి?" అన్నాడు గద్దించినట్టు.

"అదేనండీ! మన వెంకడి కొడుకు లేడూ కోటిగాడు, వాడూ చదువుకుందుకి స్కూలుకి వెడుతాడట. యింత విడ్డూరం ఎక్కడేనా వుందా?" తిరుబడిగా గడప నానుకుని కూర్చుంటూ చెప్పడం ప్రారంభించారు.

"వాడి కొడుకూ అదే బడి. మన మహాలక్ష్మి అదేబడి. ఇదెక్కడిన్యాయమండీ! ఇక ఉచ్చం నీచం అంటూ లేదా? ఆచారాలు వ్యవహారాలూ మంట కలిపి పోడమేనా ఏమిటి?" సాగతీశారు.

"కాఫీ ఇచ్చి ఏమిటే ఈ సణుగుడు? ఇంతకీ నువ్వు చెప్పదలచుకున్నదేమిటే?" విసుక్కుంటూ అడిగారు.

"వాడిని పిలిచి నాలుగు కూకలేస్తారని గాని, నామీద విరుచుకుపడతారని కాదండీ! వాడాస్కూల్లో చదివితే నేను మాలక్ష్మిని మానిపిస్తాను. అయినా వస్తే వచ్చింది యిదేం మొండి ఘటమండీ బాబూ!"

"అసలే పనులు తొందరలు. నీ సొద మాను — వెళ్ళి వంటింట్లో తగలడు" అంతమనిషి అమాంతం పాలుకుర్చీలోంచి లేచి నిలబడి "నా చేతికర్రట్రా" కేకవేశారు.

మారు మాటాడకుండా చేతికర్ర అందించి లోపలికి జారుకున్నారు సూరమ్మగారు. "శివ శివా! తిరగేసి కొట్టు బాబూ!" అన్న సన్యాసిగాడి సలహాల వుంది. సూరమ్మగారి సలహా కోటిగాడు చదువుకోకూడదు "అదెలాగేనా నూనిపించాలి. ఇక లేకపోతే — తన కుందనపు బొమ్మకి, యీ మాల వెధవకి తేడా వుండకుండా పోదూ! ఎంత అపవిత్రం! కానీ తీరా భర్తగారు చేతికర్ర అడిగేసరికి వాన చంపుతారో ఏమోరా బాబూ! అన్న భయం ఆమె గుండెలో గూడు కట్టుకోక పోలేదు. "ఏమండీ! వెంకడికి చెప్పండి చాలు వాడే నాలుగు తంతాడు. మీరు చెయ్యి చేసుకోకండి ఆ పాపం మనకెందుకు?" చెక చెక మెట్లు దిగుతున్న భర్త వెంబడిపడి వెళ్ళిందే చెప్పడం ప్రారంభించిన భార్య ముఖంలోకి చూస్తూ "పిరికి సన్యాసివే! పిరికిసన్యాసి! మళ్ళీ వకీలుగారి కూతురు! అందుకే కాబోలు కరణానికి సీతుల వణ్ణిస్తోంది..." నవ్వుకుంటూ మెట్లు దిగేసి పెరటివైపు నడిచారు.

* * *

"అరె! కోటీ అప్పుడే వచ్చేశావే రారా!" చిరుతో ఆప్యాయంగా లోపలికి ఆహ్వానించింది. స్కూలు బల్లలు వచ్చేశాయి. చిరుతో ఉత్సాహంగా టీచరమ్మతో పాటు పీరాయితో పాటు బల్లలు తుడిచి సరిచేస్తుంటే కోటిగాడి మనస్సు కొత్త పల్లవి పాడుతూంది.

"ఏరా! నీకు అసలు అక్షరాలు తెలుసా?" నవ్వుతూ అడిగింది ఇందిర.

"తెలుసండమ్మ... అమ్మాయిగారు చూపిస్తారుకద. ఇదిగో ..." అంటూ టీచరమ్మకి కాస్త దూరంలో మోకాళ్ళమీద ఆనుకుని 'అ' రాశాడు కోటి. దాన్ని చూసి గట్టిగా నవ్వడం ప్రారంభించింది ఇందిర.

"ఓరేయ్! అమ్మాయిగారిలాగే నేర్పారా?" తలూపాడు

కోటిగాణ్ణి లేవదీసి, రాసినదానికి తలవైపు కూర్చోబెట్టి ఇప్పుడు చూడు! ఇలా ఉండాలి "అ" అంది నవ్వుతూనే. సిగ్గుపడిపోయాడు కోటి.

"అమ్మాయిగారి పక్కగా కూర్చుని నేర్చుకుని ఉంటే ఇలా సరిగ్గా వచ్చేదిరా. కానీ.. దూరంగా ఎదురుగా కూర్చుని తలకిందులు చూశావు. అలాగే నేర్చుకున్నావు. ఫరవాలేదులే. నాల్రోజుల్లో — నీ కన్ని అక్షరాలు నేర్పేస్తాను." అంది సంతోషంగా ఇందిర.

క్లాసులో పిల్లలు సర్దుకుని నిలబడ్డారు. కోటిగాడికేసి కొందరు దొంగ చూపులు చూస్తున్నారు. కానీ, ఇందిర ఇవేం గమనించడంలేదు. ఆలో వాడిపట్ల అవ్యాజమైన అభిమానం పొంగింది. ప్రార్థన చేయించింది.



ఇంతట్లోనే బడిముందు వెంకన్నవచ్చి నిలబడ్డాడు.

"అమ్మగోరూ! కోటిని పంపించేయండమ్మా!" చేతులు జోడించి అడిగాడు.

"అదేంరా! నీ కొడుకు చదువుకోడం ఇష్టంలేదా? చూడు వాణ్ణి" చెయ్యి చాపి అందరిమధ్య వింతో ఆనందంగా నిలబడివున్న కోటిని చూపించింది. వెంకడి కళ్ళు చెమర్చాయి. కానీ యింతలోనే నిండుధైర్యం తెచ్చుకున్నాడు.

"వాడికి చదువెందుకండమ్మా! పంపించెయ్యండి. అయ్యగారు కోపంచేస్తున్నారు."

నవ్వుతూ "అలా చెప్పమరి!" అంది ఇందిర.

"ఏరా నీ కొడుకు చదివి కలెక్టరవుతాడా? పెద్ద ఉద్యోగాలకెడతాడా? గొడ్లకాడ పడివుండక ఏంటీ పొగరు?" "అన్నారా కరణంగారు" అడిగింది ఇందిర.

"అమ్మగోరూ!" సరిగ్గా జరిగింది జరిగినట్లు చెప్పేసరికి ఆశ్చర్యం వేసింది — వెంకన్నకి.

"అలాగే అంటార్రా! మీ మీద బ్రతికేవాళ్ళు. చూడు వెంకన్నా-నువ్వు కాకపోతే ఇంకో పాలేరు వస్తారాయనికి. కానీ, నీ కొడుకు పైకి రాడం యిష్టంలేదా ఆయనగారికి?"

"మా యజమానులని కాదని మేం విలా బ్రతకగలం తల్లీ! ఏదో ఆశపడ్డాడను కున్నానుగానీ, యిలాంటి గొడవౌతుందని తెలియదమ్మా! పొరపాటైపోయింది.



పంపేయండమ్మా! లేకపోతే అయ్యగారు వాడినే కాదు, నన్నూ చితక పొడిచేస్తారు." బ్రతిమాలుతూనే ఉన్నాడు. ఈ లోగానే చేతిలో పలక నేలకేసి కొట్టి, క్లాసులోంచి దూసుకు పారిపోయాడు కోటిగాడు.

వాడికి దుఃఖం పొంగు కొచ్చింది. "అందరి పిల్లల మీదా తల్లికి తండ్రికీ హక్కు వుంటుంది. నామీద మటుకు అందరికీ!" కోపం కట్టలు తెంచుకుంది కోటిగాడిలో. ఉండేలుబద్దతో కనిపించిన పిచ్చికనీ, కాకినీ, ఉడతనీ నేలకరిపిస్తూ కసిగా చెట్లూ పుట్టలూ తిరగడం మొదలుబెట్టాడు.

ఎదురు చూడని ఈ పరిణామానికి ఇందిర కూడా ఆశ్చర్యపడింది. "కోటీ ఒరే" అంటున్న తండ్రి మాట ఖాతరు చేయకుండా ముందుకి బాణంలా దూసుకు పోయిన కోటిగాడి కేసి చూస్తూ ఉండి పోయింది ఇందిర.

"చూశావా?" అంది.

"ఫరవాలేదమ్మగారూ! కోపం పోతే, ఆఖరికి వాడే ఇంటికొస్తాడు." అన్నాడు నెమ్మదిగా వెంకన్న.

"మనిషికి కడుపు ఆకలి తీరితే చాలదు వెంకన్నా! బుర్రకి కూడా ఆకలేస్తుంది. చూడు వాడికీపూట సూర్యోదయంతోపాటే సూర్యుణ్ణి అస్తమించేలా చేశావు. వాడు నిన్ను క్షమించడు. అసలేబిడ్డా యిలాంటి తండ్రిని క్షమించడు! వెంకన్నా వెళ్ళు. వాడెక్కడున్నా రాత్రికి ఇంటికి తీసుకురా. నేను నచ్చచెప్తాను." అంది.

అలా అందే కానీ, ఇందిరకి వాడు తిరిగి వస్తాడనిపించలేదు. లేతమనస్సుకి బలమైన గాయంతగిలింది. దాన్ని కాలమే సరిచేయ కలదు —అనుకుంది.

"రండి యిక్కడ పాఠాలు చూద్దాం." అంది కాని, క్లాసు క్లాసంతా పిండిబొమ్మల్లాగా అయిపోయిన సంగతి గ్రహించక పోలేదు ఇందిర. పాపం! పసివాళ్ళకి వెంకడి కొడుకు అంటరాని వాడనే తెలుసు. కానీ, చదువుకోకూడదని యిప్పుడే తెలిసినట్లుయింది. "ఈపూట కూర్చుని వీళ్ళ చిన్ని మనసుల్లోంచి యీ విక్షస్తప్ప భావన తొలగించాలని నిర్ణయించుకుంది ఇందిర. కానీ, పిల్లలకి పాఠాలు చెప్తున్నంతసేపూ ఆమె మనస్సులోంచి కోటిగాడు తప్పిపోలేదు. వాడు చేతకాని కోపంతో, పలకని నేలకేసి కొట్టినప్పుడు, వాడి కంటి కొనల జారిన నిస్సహాయత, నిర్వేదం, ఇందిర మనస్సులో బాధాకరమైన ముద్ర వేసేశాయి. ఎలాగేనా వాడికి చదువు చెప్పాలి — ఎలాగేనా వాడిని మనిషిని చెయ్యాలి— అనుకుంది. ఆ క్షణంనుంచీ దారులు వెతుకుతోంది ఇందిర మనస్సు. మనిషిమీద మనిషికింత అధికారమా? ఆమె గుండెలు ఆవేదనతో నిండి పోయాయి. ఏ కన్నతల్లి బిడ్డకీ ఇలాంటి గతి పట్టకూడదు — పట్టనివ్వను. మనసు ఉంటే మార్గముంటుందని కోటిగాణ్ణి సాధ్యంచేస్తాను అనుకుంది. మనస్సు తేలికపడింది.

(ఇంకా వుంది)



# వసంతా! నీవెవరివేటి?



**గండిపేట—**

హుషారుగా, సరదాగా ఉంది జనం గుంపులు గుంపులుగా కూర్చుని ఉన్నారు. నిలబడి ఉన్నారు తిరుగుతున్నారు

నున్నటి ఎండ మధ్య మధ్య సూర్యుడికి మబ్బులడ్డం వచ్చి, చల్లగా, ఎయిర్ కండిషన్ చేసినట్టు అవుతోంది వాతావరణం

పిక్‌నిక్‌కి చక్కటి రోజు.

ఎదురుకుండా కూర్చున్న కుటుంబాన్ని చూస్తున్నాడు రమణ.

ఒక యిరవయ్యేళ్ళ అమ్మాయీ, నడివయసు ఆడవాళ్ళిద్దరూ, పదేళ్ళ కుర్రాడొకడూ, ఐదేళ్ళ కుర్రాడింకొకడూ.

ఆ అమ్మాయి అందంగా, నాజూగ్గా చీరల అడ్వర్టైజ్‌మెంటులో మోడల్‌లా ఉంది. కాలేజీలో చదువుకుంటూ ఉండవచ్చు అయినా ఇంకా చిన్నతనం పూర్తిగా పోయినట్టు లేదు పిల్లలతో సమానంగా ఆడుతోంది. నవ్వుతోంది స్వేచ్ఛగా, కేర్ ఫ్రీగా.

తదేకంగా చూశాడు రమణ.

"ఇంత చక్కగా ఉంది ఈ అమ్మాయి పేరేమయి ఉండొచ్చు?"

సుందరి... మోహిని...

ఉహూఁ.. నచ్చలేదు.

ఓ క్షణం ఆలోచించాడు.

లేతాకుపచ్చ వాయిల్ చీర, ప్రకృతి కన్యలా, వనదేవతలా ఉంది అమ్మాయి.

వసంత!

కరెక్ట్! వసంత ... నిజంగా వసంత ఋతువు లాగే ఉంది.

తృప్తిగా నవ్వుకున్నాడు

వసంత, బాల్ విసురుతోంది. పిల్లలు పరుగెత్తుకెళ్ళి దాన్ని తెస్తున్నారు.

మళ్ళీ విసురుతోంది

పిల్లలు పరుగెడుతున్నారు.

మళ్ళీ ..

బాల్ దూరంగా వెళ్ళి ముళ్ళ పొదల మధ్య పడింది.

దాన్ని తీయడం పిల్లల చేత కాలేదు.

వసంత ప్రయత్నించింది, ఉహూఁ ... రాలేదు.

సుకుమారంగా ఉన్న వసంత శరీరానికి గుచ్చుకుంటున్నాయ్ ముళ్ళు

నిస్సహాయంగా రమణ వైపు చూసింది.

రమణ గర్వంగా అడుగులేస్తూ వెళ్ళాడు.

నిస్సంకోచంగా ఆ పొదలోకి వెళ్ళి బాల్ తీసుకొచ్చాడు. ఒళ్ళంతా గీరుకుపోయింది. రక్తం చారలుగా కారుతోంది.

అయితేనేం! వసంత కళ్ళలో ఆ తృప్తి, ఆ మెప్పుదల చూడ్డానికి ఇలాంటి ఘన కార్యాలెన్నో చేస్తాడు.

"గట్టిగా విసురు అక్కయ్యా! మరీ దగ్గర దగ్గరగా వేస్తావ్" అంటూ విసుక్కుంటున్నాడు పెద్దకుర్రాడు.

"నా చేతులు నెప్పెడుతున్నాయిరా. ఇంతకంటే గట్టిగా వెయ్యలేను" అంటోంది వసంత.

కల కరిగిపోయింది. నీరసంగా నవ్వుకున్నాడు రమణ

ఒక్క క్షణం సేపు ఫాంటసీ.

ఈ అలవాటు ఇప్పటిది కాదు. చిన్నప్పట్నుంచీ అంతే. అందమైన ఆడపిల్లల్ని వర్ని చూసినా, వాళ్ళు తనని ఏదో కోరాలనీ, తను తీర్చాలనీ ఉబలాటం

కానీ ఈ పాతికేళ్ళ జీవితంలో, అంత అదృష్టం ఎప్పుడూ పట్టలేదు ఎన్నోసార్లు ఆశాభంగం పొందాడు అంత మాత్రాన తను కలలు కనడం మానడు. ఇది తన జీవిత ధ్యేయం

వసంతా వాళ్ళు కూడా తెచ్చుకున్న టిఫిన్ బాస్కెట్ తెరిచారు తేరిపార చూడటం సభ్యత కాదని పక్కకి తిరిగి కూర్చున్నాడు రమణ

ఆ పెద్ద బ్బాయి నీళ్ళు తేవడానికి వెళ్ళాడు. ఈ లోపలే తినడం మొదలెట్టారు అందరూ ఏవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు జోకులేసుకుంటున్నారు నోట్లో స్వీట్ పెట్టుకుంటున్న వసంత ఫక్కున నవ్వేసింది. కొరబోయింది

"నీళ్ళు తాగు నీళ్ళు తాగు ..." అంటున్నారు ఆ ఆడవాళ్ళిద్దరూ

నీళ్ళేవీ?

వసంత తన వాటర్ బాటిల్ వైపు చూసింది

అర్థం చేసుకుని తను వెళ్ళి నీళ్ళందించాడు త్వరత్వరగా రెండు గుక్కలు తాగి,

# వసంతా నీ పేరేమిటి?

తేరుకుని, రమణవైపు కృతజ్ఞతాపూర్వకంగా చూసింది వసంత.

చాలు. తనకీ తృప్తి చాలు.

"ఎందుకురా వద్దంటుంటే మూడు వాటర్ బాటిల్సు తెచ్చారు? తాగడానికా, స్నానం చెయ్యడానికా ఇన్ని నీళ్ళు?" అంటోంది వసంత.

ఫాంటసీ ఫుల్లీ చెదిరిపోయింది.

అసలు ఏ అమ్మాయైనా తన సహాయం ఎందుకు కోరుతుంది? ఏం ప్రత్యేకత ఉంది తనలో? తను సగటు మనిషి. మామూలుగా ఉంటాడు. ఎన్ని సార్లు పరిచయం చేసినా, ఎప్పటికప్పుడు కొత్తవాడిలాగే కనబడతాడు తను. సాదా ప్యాంట్లూ, సాదా షర్ట్సూ. కనీసం ఫ్యాషన్‌బుల్‌గా ఉండాలని బెల్‌బాటమ్స్ కుట్టమంటే, స్ట్రెయిట్ ప్యాంట్లూ, బెల్సూ కాకుండా మధ్యస్తంగా కుట్టాడు. సాదా! అలాగే తను ప్యూనూ కాదు. ఆఫీసరూ కాడు. కేవలం గుమాస్తా.

ఈ గుమాస్తాగాడి ఒకే ఒక్క కోరిక... అందమైన అమ్మాయి తననేదన్నా కోరితే తీర్చాలని... ఈ కోరిక తీరదు తనకు. ఎన్నాళ్ళనుంచి, ఎన్నేళ్ళనుంచీ ఎదురు చూస్తున్నాడు తను!

ఎవరో ఇద్దరు కాలేజీ కుర్రాళ్ళు—స్టెప్ కటింగూ, ముప్పయ్యయిదంగుళాల బాటమ్ ప్యాంట్లూ, ఈనె పుల్లల్లాంటి పర్సనాలిటీలు; ఇటే వస్తున్నారు.

బాగా దగ్గిరికి వచ్చాక వాళ్ళ ఊహ అర్థమయింది.

వసంతకి దగ్గరగా వస్తున్నారు వాళ్ళు. ఆడవాళ్ళూ, చిన్నపిల్లలు, తప్ప మొగాళ్ళెవరూ తోడులేరు కదా అని ధైర్యం వాళ్ళకి.

మొగాళ్ళెవరూ లేరూ?

సడెన్‌గా తను వసంతకి గార్డియన్ అయినట్లనిపించింది.

కుర్రాళ్ళిద్దరూ మరీ దగ్గరగా వచ్చారు.

కర్ణకఠోరంగా వినబడింది వాళ్ళు కూసిన కూత.

ధైర్యంగా, వసంతకు రెండు గజాల దూరంలో కూర్చున్నారు.

ఏదో ప్రేలాపన, ఏవో నవ్వులు.

వసంతా వాళ్ళు లేచి వచ్చి తన పక్కన కూర్చున్నారు.

"అన్‌సివిలైజ్‌డ్ బాస్టర్డ్స్" అంది వసంత తనతో.

"జాగ్రత్తగా మాట్లాడు" అన్నాడు వాళ్ళలో ఒకడు.

వసంత తనవైపు చూసింది. ఆ చూపులో ప్రార్థన, సంకేతం.

అంతే!

తను లేచాడు.

తెలుగులో కృష్ణలాగా, హిందీలో ధర్మేంద్రలాగా, ఇంగ్లీషులో క్లింట్ ఈస్ట్‌వుడ్ లాగా,

ఫెడీ! ఫెడీ! ఫెడీ!

వసంత కళ్ళలో ఆరాధన.

"మీరిద్దరే వచ్చారా?" అంటోంది వసంత ఆ కుర్రాళ్ళతో.

"మేమిద్దరమే వచ్చాం. చాలా సేపయింది. ఇంక వెళ్ళిపోతున్నాం. మీరింకా ఉంటారా?" అన్నాడు వాళ్ళలో ఒకడు.

"నాలుగింటి తర్వాత బయలుదేరుతాం మేము. బాగా చదువుకుంటున్నావా ప్రసాద్?" అని అడిగింది నడివయసావిడ.

"బాగా. చదవడమేమిటి? కాలేజీలో ఎప్పుడూ ఫస్టుక్లాసు ఫస్టు" అంది వసంత.

అతను కొదిగా సిగ్గుపడ్డాడు.

"వస్తామండీ!" ఇద్దరు కుర్రాళ్ళూ నమస్కారం పెట్టి బస్‌స్టాప్ వైపు నడిచారు.

స్నేహితులన్నమాట.

ఛ!

తనకెప్పుడూ ఫస్ట్ క్లాస్ ఫస్టు రాలేదు. ఫస్టుక్లాసూ రాలేదు. కనీసం సెకెండు క్లాసూ రాలేదు. తనెప్పుడూ థర్డు లిస్టులో తప్ప, సెకెండు లిస్టులో పాసయేవాడు — జాటా గోటా మార్కులూ, గ్రేస్ మార్కులూ కలుపుకుని.

తనలో ఏ గొప్పతనమూ లేదు. ఎవరూ తనని లక్ష్యపెట్టరు. తింటున్నాడు. గాలి పీలుస్తున్నాడు. బతుకుతున్నాడు. అంతే!

అందమైన అమ్మాయి తననేదైనా కోరితే, తను హీరోలా...

ఎప్పటికయినా?

అసంభవం.

(39వ పేజీ చూడండి)

( గత సంచిక తరువాయి )


భీమసేన మహారాజు నల దమయంతుల సమాగమ వార్త విని ఆనంద పరవశుడై అన్ని దేవాలయముల యందు విశేష పూజలు చేయించెను.



తరువాత ఋతుపర్ణుడు నలుని నుండి అశ్వహృదయోపదేశంబును పొంది అయోధ్యకు మరలి పోయెను........


నలమహారాజు మామయగు విదర్భేశ్వరుని మందిరమున భార్యాపిల్లలతో ఒక మాసము సుఖముగ గడిపి............
ఒక సుముహూర్తమున రథారూఢుండై, పదియారేనుంగులు, యాభై గుఱ్ఱములు ఆరువందల మంది, కాల్బలమును వెంట నిడుకొని, నిషధకు బయలుదేరెను.






పుష్కరుడు రాజ్యమును ఒడ్డి ఓడి పోయెను నిషధ మరల నలుని పరమయ్యెను.





నలుడట్లు నిషధరాజ్యమును గెల్చి భార్యను పిల్లలను రావించి వైభవోపేతముగ పట్టాభిషిక్తుడై సుఖముల పొందెను.



బృహదశ్వుండు ధర్మరాజునకు అక్షహృదయము నుపదేశించి వెడలి పోయెను.

|ఇంకా వుంది|

# జీవిత  మాధుర్యం

సీరియల్

యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

**జరిగిన కథ - 6 :** బ్రతికి చెడ్డ భూషణం కుటుంబం చేసుకోబోయిన ఆత్మహత్యా ప్రయత్నం వినోదమూర్తి రాకవల్ల విఫలమవుతుంది. వాళ్లను ఆదుకొనటానికి తోటను కౌలుకు తీసుకొని కొన్నాళ్లు అక్కడే వుండాలనుకుంటాడు వినోదమూర్తి. లోగడ ఆస్తిలో తన వాటా తీసుకొని దుర్వ్యసనాలకు లోనై, సినీతార తిలోత్తమ వ్యామోహంలో పడతాడు భూషణం తమ్ముడు చక్రవర్తి. ఆస్తి అంతా హరించగా భార్య నిరాదరణతో కృశించి మరణిస్తాడు. వ్యాపారంలో కలిసిరాక భూషణం అప్పులపాలవుతాడు. కౌలుకి తీసుకున్న స్థలంలో కొంతమేర కూరగాయలకు కేటాయించి, మిగిలిన స్థలంలో ఫౌండ్రీ పెట్టడానికి ప్రయత్నాలు చేస్తూంటాడు వినోదమూర్తి. 'విశాలా వెజిటబుల్ ఫారం', 'సుకుమార్ ఇండస్ట్రీస్'ల ప్రారంభోత్సవ సన్నాహాలతోపాటు; వినోదమూర్తి, లావణ్యల మధ్య ప్రేమ వికసిస్తూంటుంది.

**( గత సంచిక తరువాయి )**

ఆ మరునాడు సిద్ధాంతి వచ్చేడు ఆనంద నిలయానికి. విశాలాక్షి జాతకం, సుకుమార్ జాతకం చూసేడు. పంచాంగం తీసి తిథి వార నక్షత్రాలను లెక్కకట్టేడు. "మాఘ శుద్ధ పంచమి మంగళవారంనాడు అంటే ఇంగ్లీషు తారీఖుల ప్రకారం ఈ నెల 24 వ తారీఖున సాయంత్రం 4 గంటల -- 30 నిముషాలకు అమృత ఘడియలు వస్తాయి. అప్పుడు సుముహూర్తం." చెప్పేడు.

ఆ శుభముహూర్తం వారంరోజుల తరువాత పడింది.

ఆ మరునాడు లారీలో సిమెంటు బస్తాలు, ఇసుక, డిస్టెంపరు రంగులు, పెయింట్సు, పనివాళ్ళు, కంట్రాక్టరు వచ్చేరు. పడిపోయిన ఇంటి వెనుక భాగాన్ని మెల్లగా తీసేసి, ఆ ఇటికలను, మట్టిని దూరంగ వెనుక భాగాన ఓ మూల వేసేరు. ప్రస్తుతం ఆ వెనుక భాగాన్ని కాస్త సర్దేసి, మరే కొత్త కట్టడం చేయక, ఇంటికి కావల్సిన చిన్న చిన్న మరమ్మత్తులన్నీ అతివాకచక్యంతో చేసేరు. మేడమీద గదులకు, క్రిందనున్న రెండు పడక గదులకు నీలంరంగు డిస్టెంపరు, ఇంట్లోని మిగతా భాగాలన్నిటికి తెల్లని రంగు, ఇంటి వెలుపలి గోడలకు లేతఆకుపచ్చ డిస్టెంపరు రంగు వేసేరు విరిగిన కిటికీ తలుపుల్ని బాగుచేసి, ద్వారాలకు, కిటికీలకు, తలుపులకు క్రీమ్ కలర్ పెయింటు వేసేరు. ఇంట్లోని ఫర్నిచర్ని మరమ్మత్తుచేసి ముచ్చటగా కొత్తవా అనిపించేటట్లు పాలిష్ చేసేరు వినోద్ బజారు నుండి ఖరీదైన ఓ డజను దుప్పట్లను, కిటికీలకు ద్వారాలకు అందమైన కర్టెన్లను కొని రామయ్య కిచ్చి పంపేడు. వినోద్ ఇంటికి వచ్చేక విశాలాక్షి అడిగింది --

"ఇవన్నీ ఎందుకు బాబూ ?"

"అత్తయ్యా! కలెక్టరుగారు మిగతా పెద్దలు ఈ హాలులోనేకదా కాఫీ త్రాగుతారు. ఓవేళ కుతూహలంకు ఎవరైన పెద్దలు ఈ ఇల్లు చూస్తామంటే అప్పుడు మన కిబ్బందిగా ఉండకుండా వుండేటట్లు ఇవన్నీ చేయిస్తున్నాను. మనింటిని మనం అందంగా అలంకరించుకోడంలో తప్పేమిటి ?"

విశాలాక్షికి మరి జవాబు ఏం చెప్పాలో తోచక వూరుకుంది.

ఇంటిల్లిపాది, పని మనుష్యులు రాజమ్మ, రామయ్య ఆనందంతో ఉక్కిరిబిక్కిరై కంట్రాక్టరు మనుష్యులు వెళ్ళిపోయేక, ఇంటా బయటా చూస్తే వాళ్ళకే అనుమానం తగిలింది, దేవేంద్ర భవనంలాగున్న ఆ ఇల్లు తమదేనా అని. వినోద్‌కి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో వాళ్ళకే తెలియదు. ఎవరో లక్షాధికారి అయ్యుండాలన్న సందేహం వాళ్ళందర్కి కల్గింది. ఎవ్వరేమన్నా జవాబుగా వినోద్ చిరునవ్వు పారేస్తాడు -- అంతే.

లావణ్య ఓ చక్కని గాజుకుండీని తెప్పించి వినోద్ గదిలోని టేబిలుమీద పెట్టింది. అందులో రోజూ ప్రొద్దున్నే తనే ఇన్ని గులాబీపూలను కోసి తెచ్చి గుత్తిగా అమర్చేది. లావణ్యకు మునుపున్న నిర్లిప్తత ఇప్పుడు లేదు. వినోద్‌తో సరదాగా మాట్లాడేది. వినోద్ ఏమి చేసినా అందులో అతని స్వార్థం లేశమాత్రమైన లేదని, అదంతా తమ కుటుంబంకోసమేనని ఆమె అర్థంచేసుకోగల్గింది. వినోద్ తనని ప్రేమిస్తున్నట్లు ఆమె తెల్సుకుందుకు అట్టేకాలం పట్టలేదు. దానికి నిదర్శనమే ఆ అందమైన గులాబితోట. ఆమె మనస్సులో అతడియందు ప్రేమ ఉత్పన్నమవబట్టే ఆనాడు అంత ఉద్వేగంతో వినోద్ చేతిని ముద్దు పెట్టుకుంది.

వినోద్ **కూడ** ఆ తరువాత చాలా సహజంగా, సంస్కారవంతంగా ప్రవర్తించేడేగాని, ఏమి అనవసరపు చొరవ చూపెట్టలేదు. వినోద్‌కు సపర్యలు చేయడంలో లావణ్యకు ఆనందంకలుగనారంభించింది వినోద్ ప్రొద్దున్న పడకనుండి లేచి ముఖం కడుక్కొని రాగానే లావణ్య వేడి కాఫీతో ప్రత్యక్షమయ్యేది. ఆమె లావణ్యపూరితమైన ముఖాన్ని చూసి సంతోషంగా కాఫీని త్రాగేవాడు.

వినోద్ ఆమెతో కాస్సేపు మాట్లాడి, స్నానాల గదిలోకి వెళ్ళి స్నానంచేసి బట్టలు మార్చుకుని క్రింద హాలులోనికి వచ్చేసరికి అందరూ ఫలహారంకోసం అక్కడ టేబిలు వద్దకు చేరేవారు. ఆనాడు తను ఏమి చెయ్యదల్చుకున్నది అందరికీ వివరంగా చెప్పేవాడు. తరువాత వినోద్ భూషణంతోను, సుకుమార్‌తోను ఓ రెండు గంటలు ఆ ఫారమ్, ఆ ఫౌండ్రీ అంతా తిరిగి అన్నీ స్వయంగా పరిశీలించి ఏమైనా చెయ్యవల్సిన పనులుంటే చెప్పి, ఫౌండ్రీలో శిక్షణ పొందుతున్న వారికి తనుకూడ కొన్ని సలహాలిచ్చి తరువాత పది గంటలయ్యేసరికి మోటారుసైకిలుని తీసుకుని బయటకు పోయేవాడు. సరిగా ఒంటిగంటకు పది నిముషాలుందనగ ఇంటికి భోజన సమయానికి తిరిగి వచ్చేవాడు.

వినోద్ ఏ పని చేసినా చాలా క్రమశిక్షణకూడి వుండేది. ఆ సిగిరెట్లు **కూడ** ఓ నియమపద్ధతిలో కాల్చేవాడు. ఎంత అవసరమైనా రోజుకి పది సిగిరెట్లకన్న ఎక్కువ కాల్చేవాడుకాదు. చాలా ఖరీదైన దుస్తుల్ని వేసుకునేవాడు. మనిషి అనవసరంగ ఎక్కువగ మాట్లాడడు. ఎప్పుడూ ఉద్రేకపడడు. సుఖమైన, కోపమైన, విచారమైనా ఆ భావాన్ని మనస్సులోనే దాచుకుంటాడుగాని తొందరపాటుతో బయటకు వెళ్లడికానీయడు. అతని దగ్గర ఎంత డబ్బున్నది ఎవ్వరూ గ్రహించ శక్యంకానివిధంగా ప్రవర్తిస్తాడు. అందర్ని సమ్మోహితులనుచేసే అతడి అందమైన చిరునవ్వే అతడి రక్షణ, ఆయుధంకూడ. వినోద్ చాలా దర్జాగా ఉంటాడు. హుందాగా ప్రవర్తిస్తాడు. ఎవ్వరు అతడ్ని విలాసపురుషుడని అనలేరు.

వినోద్ ఆ ఇంట్లోని అందర్ని మంత్రముగ్ధుల్ని చేసేడు. వినోద్ ఏమి చేస్తున్నా కాదని చెప్పడానికి ఎవ్వరికి అభ్యంతరంగాని, కారణంగాని, ఆఖరికి ధైర్యంకూడ లేకుండాపోయింది. ఆ ఇంటిని, ఆ పరిసర స్థలాన్ని అతడికి తోచినవిధంగా అమర్చుతున్నా, అందరు ఆనందంగా చూడడమేగాని ఏ అడ్డంకులు పెట్టలేదు. వినోద్ తమవాడేనన్న భావన అందరి మనస్సుల్లో బాగా నాటుకుంది.

తొలుదొల్త వినోదమూర్తికి ఆశ్చర్యం కల్గించిన విషయమేమంటే ఈ విశాలప్రపంచంలో కోటానుకోట్లమంది మనుష్యులు బ్రతుకగల్గు

తున్నప్పుడు, ఓ ఆరుగురు వ్యక్తులు ఈ ప్రపంచంలో బ్రతుకలేక, ఎవ్వరూ ఆ తోటి మానవులకు చేయూత నివ్వకపోడంవల్ల గత్యంతరం లేక ఆత్మహత్యకు పూనుకోడం అన్నది, వినోద్‌కి చాలా దిగ్భ్రాంతి కల్గించింది. ఆ వూరులోని మనుష్యులమీద వారి చర్యవల్ల జుగుప్స, కోపం కూడా కల్గేయి.

వినోద్‌కి ఆ కుటుంబ సభ్యులు ఆరుగురి పైనా చాలా జాలి కల్గి, అతడి అంతరంగం కరుణతో నిండిపోయింది. అందుకే అతడు మొదటదానినే ఓ ఛాలెంజిగా పరిగణించి, ఓ ఎడ్వంచర్‌గా తీసుకుని రంగంలోకి దిగేడు. తన పర్యటనను ఆపుకుని, వాళ్ళింట్లో వుండిపోయేడు. తరువాత క్రమేపి వాళ్ళయందు ఆప్యాయత, అనురాగం పెంచుకున్నాడు. లావణ్య యందు ప్రేమ జనించింది. ఎంతో అందమైన లావణ్య సహచర్యంలో ఆనందంపొందవారంభించేడు.

## 9

ఆ శుభదినం రానేవచ్చింది. అంతకుముందు రోజునే ఆనందనిలయం మెయిన్ గేటుకు ఎడమవైపు 'విశాల వెజిటబుల్స్ ఫారమ్' – మేనేజరు : రాజభూషణం అని, గేటుకు కుడివైపున 'సుకుమార్ ఇండస్ట్రీస్' – మేనేజరు : సుకుమార్, బి. ఏ. అని, అందమైన బోర్డులను బలమైన రాటలు పాతించి పదడుగుల ఎత్తులో మరమేకులను బిగించి నిలబెట్టేరు పనివాళ్ళు.

ప్రారంభోత్సవానికి ఆ ఊరులోని ప్రముఖులందరికి ఆహ్వాన పత్రికలను పంపేరు. సుకుమార్, వినోద్, భూషణం స్వయంగా వెళ్ళి కలెక్టరుగార్ని, పోలీసు సూపరింటెండెంటుగార్ని, వర్తక సంఘాధ్యక్షులైన బంగారురాజుగార్ని ఆహ్వానించేరు. ఊరిలోని పెద్దలను కొందర్ని స్వయంగా వెళ్ళి పిలచేరు.

ఆనాటి సభకు బంగారురాజుగారు అధ్యక్షులుగా ఉండడానికి, కలెక్టరుగారు, పోలీసు సూపరింటెండెంటుగారు ముఖ్య అతిథులుగా వుండడానికి సమ్మతిని తెల్పేరు.

సభలో ఆహుతులను ఆహ్వానించడానికి రాజభూషణం వినోద్ కోరికపై ఒప్పుకున్నాడు. ఆ సమయంలో ఏం మాట్లాడవల్సింది వినోద్ చెప్పేడు. అంతగా ఇష్టంలేకపోయినా భూషణం ఒప్పుకోక తప్పలేదు.

"అది కాదు మామయ్యా – నా పేరు ప్రస్తావనలోకి రాకూడదు. నేను వివరించి చెప్పలేనుగాని నా పేరు ఎత్తకపోవడమే నాకు చాలా మంచిది. పైగా మీరు స్వయంకృషిపై ఇంత సాధించేరంటే ఈ సమాజంలో మీ ఘనత పెరుగుతుంది. నాకు కావల్సింది. నాకు ఆనందం కల్గించేది అదే. నేను నిమిత్తమాత్రుడుగానే వుండదల్చేను."

"సరే నీ ఇష్టం బాబూ!"

ఆ సాయంత్రం ఆహ్వానితులందర్కి సభానంతరం పార్టీ ఇవ్వడానికి తలపెట్టేరు. రెండు స్వీట్సు, రెండు సేవరీసు, ఏపిలు, అరటిపండు, కాఫీ, కిల్లీ ఇవ్వడానికి ఏర్పాట్లు జరిగాయి. ఆ ఊరిలోని పెద్ద హోటలుకి రెండువందలమంది అతిథులకు ఆవిధంగా పార్టీ ఇవ్వడానికి ఆర్డరు ఇచ్చేడు వినోదమూర్తి.

మధ్యాహ్నం మూడుగంటల ముప్ఫై నిముషాల నుండి మండపంలో ఓ మంచి బాండువాయిద్యాలు మొదలయ్యేయి. మెల్లమెల్లగా అతిథులు రావడం మొదలెట్టేరు. గేటు దగ్గర ఒకవైపు లావణ్య, గోపీ మరోవైపు సుకుమార్, వనజ చక్కగా ముస్తాబై, వస్తున్న అతిథులకు పన్నీరు జల్లి, ప్రక్కన టేబిలుమీద పెట్టిన పళ్ళాలలోని చక్కటి గులాబీలను తీసి ఒక్కొక్కటి ఇవ్వడం చేసేరు

ఆ తోటంతా రంగురంగుల జెండాలతో ఎంతో శోభాయమానంగా వుంది. మూడురోజులై పనివాళ్ళు, ఫ్యాక్టరీలోని కుర్రాళ్ళు లావణ్య ఆధ్వర్యంలో రంగురంగుల కాగితాలను కత్తిరించి రకరకాలైన భంగిమలలో వాటిని మలచి తోరణాలుగా కట్టేరు.

ఆ శ్రావ్యమైన బాండువాయిద్యాలు వినవస్తుంటే, తోరణాల అందాలలో చక్కని దుస్తులు వేసుకున్న మొగవారు, పట్టుచీరల్లో మెరిసిపోతున్న ఆడ అతిథులు తిరుగుతుంటే ఆ తోటంతా ఎంతో ఆహ్లాదంగా వుంది. అతిథుల మధ్యన విశాలాక్షి పట్టుచీర కట్టుకుని, రాజభూషణం ఖరీదైన జరీబట్టలు కట్టుకుని అతిథులను పలకరిస్తూ తిరుగుతుంటే వాళ్ళ సంతోషానికి అవధిలేదు.

నాలుగుగంటల ముప్ఫై నిముషాలకు కాస్త ముందరగానే ముఖ్య అతిథులు ఆహ్వానితులందరూ



వచ్చేసేరు ఇంటిముందర ఎక్కా॥ ఒమర్చిన చాందిని క్రింద ఎత్తుగా ఓ వేదిక అమర్చేరు. మధ్యన ఓ టేబిలు, చక్కని సిల్కు టేబిలు క్లాత్, పూలగుత్తులతో నిండిన గాజుకుండి — వేదికమీద అందమైన తివాసి — వేదికకు ఇరువైపుల మూడడుగుల ఎత్తున దీపాల ప్రమిదలు ఒక్కొక్కటి ఉన్నాయి. ఆ వేదిక ముందర మధ్యన, ఇరువైపుల మనుష్యులు తిరగడానికి నాలుగేసి అడుగుల త్రోవలు వదిలేసి కుర్చీలు వేసున్నాయి. వచ్చిన అతిథులందరు ఆందు ఆసీనులయ్యున్నారు. ఫౌండ్రీలోని పనివారు, ఫారమ్‌లోని పనివారు మంచి దుస్తులు వేసుకుని వేదికకు ఒక ప్రక్కగా నుంచున్నారు.

మూడుగంటలన్నర నుండి శాస్త్రులవారు ఫౌండ్రీలో గణపతి పూజ, శక్తి పూజ చేయిస్తున్నారు. నాలుగున్నరలోగా ఆ పూజలను సమాప్తి చేసి సరిగ్గా నాలుగుగంటల ముప్పై నిముషాలకు శాస్త్రులవారు వేదికపైకి వచ్చి తెచ్చిన పూజాజలం వేదికపైన జల్లి రాజభూషణం దంపతులను వేదికపైకి ఆహ్వానించేరు వారు రాగానే రాజభూషణంకు, విశాలాక్షికి తెచ్చిన తీర్థం యిచ్చి, విశాలాక్షిని ఆ దీపాలు వెలిగించమన్నారు.

హృదయం ఉప్పొంగుతుంటే విశాలాక్షి ఆ రెండు ప్రమిదలలోని దీపాలను వెలిగించి దీపాలకు, సభాసదులకు నమస్కరించి వేదిక దిగి తన స్థానంలోకి పోయి కూర్చుంది. భూషణం సభా కార్యక్రమం మొదలెట్టేడు.

''సభాసదులందరికి నా నమస్కారాలు -- మన పట్టణానికి మణిలాంటివారు, వర్తక ప్రముఖులు, వాణిజ్య సంస్థ అధ్యక్షులు అయిన శ్రీ బంగారురాజు గార్ని ఈనాటి సభకు అధ్యక్షులుగా వుండమని కోరుతున్నాను. సభా వేదికపైకి దయచేయమని మనవి. ఈనాటి సభకు ముఖ్య అతిథులుగా మన జిల్లా కలెక్టరుగార్ని, జిల్లా పోలీసు

# జీవిత మాధుర్యం

సూపరింటెండెంటుగార్ని వేదికపైకి వచ్చి ఆసీనులుకమ్మని వేడుకుంటున్నాను.''

వేదికపైకి ముగ్గురు పెద్దలూ వచ్చేరు. సుకుమార్ పూలదండలను వేసేడు.

అధ్యక్షులు సభా కార్యక్రమం చదివి 'మొదట ప్రార్థన' అన్నారు.

లావణ్య, వనజ కలిసి మధురంగా వినాయకుని, తరువాత లక్ష్మిని, విష్ణుని స్తుతించేరు.

తరువాత అధ్యక్షులవారు తమ ఉపన్యాసంలో ఇలా చెప్పేరు --

''నేను రాజభూషణంగార్ని బాగా యెరుగుదును. అతని తండ్రిగార్ని యెరుగుదును వాళ్ళ వంశం రాజవంశం లాంటిది. ప్రతితరానికి ఒడుదుడుకులున్నట్లు ఈ తరంలో రాజభూషణం గారు వ్యాపారంలో అంత కలసిరాక కొంత నలిగిపోవడం నిజమే. కాని ధైర్యాన్ని కోల్పోక, పట్టుదలతో శ్రమించి వ్యాపారాన్ని మరో దిక్కుకు మరల్చి, కొత్త పంథాలో నడిపించడం మెచ్చుకోదగ్గ విషయం. అతని నుండి చాలామంది వ్యాపారులు నేర్చుకోవల్సిన విషయమిది.

తరాలుగా చేస్తున్న వ్యాపారంలో నష్ట మొచ్చినా ఆ వ్యాపారాన్నే పట్టుకుని కొంతమంది వదలరు. అది అంతసరైన మార్గంకాదు. రాజభూషణంగారు చాలా చాకచక్యంతో కొత్త విషయాల్ని తెల్సుకుని కొత్తమార్గాల్ని అన్వేషించేరు. వారి కృషి ఫలించాలని, మళ్ళీ రాజభూషణంగారు వర్తకరాజులై మన పట్టణానికి గర్వకారణం కావాలని కోరుతున్నాను.

ఇప్పుడు వేదపారాయణం, శుభాశీస్సులు పండితులవారు జరిపిస్తారు. స్వస్తివాచకానంతరం మన జిల్లా పోలీసు సూపరింటెండెంటుగారు మొదటి కాబేజీని కోసి విశాల వెజిటబుల్ ఫారమ్‌ని ప్రారంభిస్తారు. తదుపరి మనజిల్లా కలెక్టరుగారు సుకుమార్ ఇండస్ట్రీస్ ప్రారంభిస్తారు.''

పండితులు వేదపారాయణం ఘనంగా చేసి, స్వస్తి చెప్పేరు. తరువాత సభికుల కరతాళధ్వనుల సంరంభంలో తోటలో మొదటి వరుసలోని పెద్ద కాబేజీని రాజభూషణం కోరికపైన పోలీసు అధికారిగారు కోసేరు తరువాత వెనుక వరుసల్లోని ఓ పెద్ద కాలీఫ్లవర్‌ని కోసి రాజభూషణంకు అందించేరు. ఒక్కకాబేజి అయిదు కేజీలుంటుంది. ఆ కాలీఫ్లవర్ నాలుగు కేజీలకు పైనే ఉంటుంది. అంతపెద్ద సైజు కూరల్ని చూసి అందరూ ఆశ్చర్యపోయేరు. పోలీసు అధికారి రాజభూషణం గారి కృషిని మెచ్చుకున్నారు.

తరువాత జిల్లా కలెక్టరుగారు స్విచ్చి వేసి ఫౌండ్రీలోని ఎలక్ట్రిక్ ఓవెన్‌ను వెలిగించేరు. అందరూ ఆనందంతో చప్పట్లు కొట్టేరు. కలెక్టరుగారు ముఖ్య అతిథిగా ఇచ్చిన ఉపన్యాసంలో ఇలా పేర్కొన్నారు.

''ఇవాళ చాల సుదినం. ఇంతటి బృహత్ కార్యాన్ని చేపట్టిన రాజభూషణంగారు, అతని కుటుంబ సభ్యులు చాల శ్లాఘనీయులు. ప్రభుత్వ ప్రతినిధిగా నేను ఏమైనా రాజభూషణంగార్కి తోడ్పడాలంటే తప్పకుండా సహాయపడ్తానని మాటిస్తున్నాను. అన్నిటికన్న మెచ్చుకోదగ్గ విషయం ఈ వెజిటబుల్ ఫారమ్. చాలమంది వ్యాపారులకు ఇది చిన్నతనంగా తోచవచ్చు గాని ఇది చాల ప్రశంసనీయమైన కృషి. నేను ఇందుకే రాజభూషణంగార్ని చాల గౌరవంగా చూడగల్గుతున్నాను. మనదేశానికి కావల్సింది ముఖ్యంగా తిండి. అందులో అంతర్భాగమే ఈ కూరగాయలు. ప్రజలకు బియ్యం, పప్పుదినుసులు ఎంత అవసరమో ఈ కూరగాయలు అంత అవసరమే. వాటిని పెద్దయెత్తున పండిస్తున్నందుకు నేను చాల సంతోషిస్తున్నాను. త్వరలోనే జిల్లా కేంద్రంలో ఈ వసంతంలో ఫల పుష్ప ప్రదర్శన జరుగుతుంది. దానికి రాజభూషణంగారు తమ ఫారమ్ నుండి ముఖ్యంగా ఈ పెద్ద కాబేజీలను, ఈ పెద్ద కాలీఫ్లవర్లను పంపాలి. అందరు చూసి ఆనందిస్తారు.

ఇక నా దృష్టిని ఆకర్షించింది ఈ ఇంటి ప్రక్కనున్న అందమైన గులాబీల తోట. ఈ తోటలో చాల అందమైన రకాల గులాబీలున్నాయి. వాటన్నిటిని స్వహస్తాలతో రాజభూషణంగారి పెద్దమ్మాయి లావణ్యదేవి నాటి పెంచేరని విన్నాను. నాకూ గులాబీలంటే బహుప్రీతి. మీరందరు తప్పక ఆ పూల తోటను చూసి ఆనందించండి. రాజభూషణంగారి అభ్యంతరం లేకపోతే ఈ తోటలోని ముఖ్యమైన రకాల గులాబీలను కొన్నిటిని గోలాలలో వేసి జిల్లా ఫలపుష్ప ప్రదర్శనకు పంపమని లావణ్యదేవిని నేను కోరుతున్నాను.

ఇక సుకుమార్ ఇండస్ట్రీస్ గురించి చెప్పవల్సింది ఎంతైన ఉంది. ప్రభుత్వ ముఖ్యోద్దేశం విదేశ సరకుల్ని వీలైనంతమటుకు దిగుమతి చేసుకోడం మానివేసి, దేశం స్వయం సమృద్ధి సాధిం

రాత్రుళ్ళు నిద్రలో లేచి నడిచేదాన్ని డాక్టర్ ఇంతక్రితం!
కానీ ఈమధ్య నిద్రలో లేచి నవలలు రాస్తున్నా!!



# మిరమిట్లు గొల్పే తెలుపు
# చూడగానే
# అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

## డెట్

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

...డమే. అందువల్ల పారిశ్రామికంగ మనదేశం చాల ముందుకుపోవాలి. ఆ దృక్పథంతోనే రాజభూషణంగారి కుమారుడు వయస్సులో చిన్నవాడైనా చాలా ఉన్నతాశయంతో ఈ ఫౌండ్రీని స్థాపించి యాజమాన్యాన్ని స్వీకరించేడు. అతని ఆశయం నెరవేరాలని, అతని కృషి ఫలించాలని, శ్రీమతి విశాలాక్షిగారు వెలిగించిన ఈ జ్యోతులు దేదీప్యమానంగా ఇలాగే వెలుగుతుండాలని కోరుకుంటున్నాను. నా సహాయం ఏమైనా ఉన్నదంటే చేయడానికి నేనెప్పుడూ సంసిద్ధుణ్నే.

ఈనాటి కార్యక్రమానికి ముఖ్య అతిథిగావచ్చినందుకు నా సోదర అధికారితోబాటు నేనూ చాల సంతోషిస్తున్నాను,'' అని కలెక్టరుగారు తమ ఉపన్యాసాన్ని ముగించేరు.

వచ్చిన అతిథులందరికీ సుకుమార్ వందన సమర్పణ చేసేడు. తరువాత అతిథులందర్కీ అల్పాహార విందు జరిగింది. విందు అనంతరం ఆహుతులందరు తోటను, వెజిటబుల్ ఫారమ్‌ను, ఫౌండ్రీని వివరంగా సందర్శించి రాజభూషణం వద్ద, ఆయన భార్య వద్ద వీడ్కోలు తీసుకుని వెళ్ళిపోయేరు.

కార్యక్రమం అంతా ముగిసి, అతిథులంతా వెళ్ళేసరికి ఏడు దాటింది. తోటంతా రంగు రంగుల బల్బులతో, ట్యూబులైట్ల కాంతితో వెలిగిపోతూంది.

వచ్చినవాళ్ళలో కొందరి వర్తకులకు కన్నుకుట్టింది. అసూయతో బాధపడ్డారు. వాళ్ళలో ఒకడు ఆ ఊరి సినిమాహాలు యజమాని రామలింగం. మరికొందరు ఇంత త్వరలో రాజభూషణం యెలా కోలుకుని గొప్పవాడయ్యేడో అర్థంకాక తికమకపడ్డారు. కొంతమంది అంతా చూసి ఆశ్చర్యంలో మునిగిపోయేరు.

అందరూ వెళ్ళిపోయేక హాలులోకి వచ్చి కూర్చున్న వినోదమూర్తి చుట్టూ భూషణం, విశాలాక్షి, పిల్లలు చేరేరు.

''బాబూ వినోద్! ఒట్టు వేయించుకుని

# జీవిత మాధుర్యం

మా అందరి నోర్లూ మూయించేవుగాని ఈ ప్రశంసలన్నీ అందుకోవ ల్సినవాడివి నువ్వు. వీటన్నిటికి, వీటితోపాటు మాకు ప్రాణంపోసిన వాడివి నువ్వు. ఇవాళ అందరిముందూ మేము మళ్ళీ తలెత్తుకుని సగర్వంగా తిరగగల్గేమంటే నువ్వు పెట్టిన భిక్షే. నువ్వు లేకపోతే మేము వట్టి మట్టిబొమ్మలమే. నువ్వు ఎందుకు వెనుకగా వుండిపోయి మమ్మల్నెందుకు ముందుకు తోసేవో మాకు బోధపడడంలేదు. నీకీ అజ్ఞాతం యెందుకు బాబూ ? నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేము. వచ్చే జన్మలో మేము ముఖ్యంగా నేను, నా భార్య విశాల నీకు బిడ్డలుగా పుట్టి నీ ఋణం తీర్చుకుంటాము. చిన్నవాడివైనా ఈనాడు నీకు చేతులెత్తి మొక్కాలనిపిస్తూంది,'' అని రాజభూషణం, విశాలాక్షి నిజంగా చేతులెత్తి నమస్కరించేరు అది చూసి పిల్లలు నలుగురు కూడ వినోద్‌కి నమస్కరించేరు వినోదమూర్తి ఇదంతా చూసి చాలా గాభరాపడి, సిగ్గుపడ్డాడు.

''అదేమిటండీ! మీ అందర్కీ ఇవాళ ఏమైంది? చిన్నవాడిని మీరు నాకు నమస్కారం పెట్టడం ఏమిటి? ఎవరైన చూస్తే నవ్విపోతారు! నన్ను ఇబ్బందిలో పెట్టకండి. మామయ్యా నా మాట వినండి. ఇందులో నా స్వార్థం లేకపోలేదు మీ అందరి ఆనందమే నా ఆనందం. మీరందరు కొత్తబట్టలు కట్టుకుని గర్వంగా, సంతోషంగా తోటను, ఈ యింటిని, ఖార్ఖానాను అందరికి చూపెడ్తుంటే, అందరూ మిమ్మల్ని అభినందిస్తుంటే—మీకన్నా యెక్కువగా పరవశించినవాడిని నేను. నిజానికి నేను పొందిన సంతృప్తిలో మీ ఆనందంపాలు చాలా తక్కువ. ఇంతకీ నేను..''

అర్ధోక్తిలోనే వనజ అందుకుంది.

''బావగారూ! ఆగండి—నేను పూర్తిచేస్తాను మీ మాటను. ఇంతకీ నేను పక్కా వ్యాపారస్తుణ్నే; లాభాలులేందే ఏ పని చేయను.''

''అబ్బా గడుగ్గాయి! నీ పనిచెప్తానుండు,'' అని వినోద్ కుర్చీలో నుంచి లేచేడు. వనజ పారిపోయింది అందరూ నిర్మలమైన హృదయాలతో నవ్వుకున్నారు. ఇబ్బందికరమైన ఆ సన్నివేశం తేలిపోయింది.

లావణ్య ఎంతో ప్రేమతో, ఆరాధనతో వినోదమూర్తిని చూస్తుండడం స్త్రీ సహజమైన గ్రహింపుతో విశాలాక్షి గమనించింది. ఆమె మనస్సులో ఓ మధురభావన జనించింది. వినోదమూర్తి ఉత్తముడు. అతడు తనకు అల్లుడైతే యెంత అదృష్టం!

ఆనాడు పౌర్ణమి. భోజనానంతరం వినోదమూర్తి అలా తోటలోకి పోయి ఏదో ఆలోచిస్తూ సిగిరెట్టు కాల్చుకుంటూ తిరుగుతున్నాడు. గులాబీల పరిమళం ఆహ్లాదకరంగా వుంది. కొంతసేపయేక మెత్తగా, చల్లగా తన చెయ్యి పట్టుకోడం తెల్సి, ఆలోచనల్ని దివి నుండి భువికి దింపి ప్రక్కన నించున్న లావణ్యను చూసి చిరునవ్వు నవ్వేడు.

''ఏమండి మేనబావగారూ — ఏమిటాలోచిస్తున్నారు? హైదరాబాదులోని మీవాళ్ళుఅంటే మీ అమ్మగారు, తదితరులు జ్ఞాపకానికివచ్చారా?''

''మరదలుపిల్లా! అదేమి కాదు. ఊరకే పండువెన్నెలని ఈ గులాబీలను చూస్తున్నాను కలెక్టరుగార్ని ఆకర్షించిన ఈ చక్కని గులాబీలను మళ్ళీ చూడాలనిపించింది. వీటన్నిటిలోకి ఈ గులాబీయే ఎంతో మృదువుగా, అందంగా వుంది,'' అని ప్రేమతో తన కుడి అరచేత్తో మెత్తగా లావణ్య బుగ్గల్ని నిమిరేడు. లావణ్య ఆ స్పర్శకు పులకించి, కాస్త వినోద్‌వైపు ఒరిగింది.

వినోద్ ఆమె భుజంమీద చెయ్యివేసి అనురాగంతో —

''లావణ్యా! నువ్వు నాదానివి కావాలి,'' అని కోరేడు.

లావణ్య ఏనాడో తన హృదయాన్ని వినోద్‌కి అర్పించింది. వినోద్ గుండెమీద తల ఆన్చి — ''నా ఈ దేహము, మనస్సు, ఆత్మ అంతా మీదేనండీ,'' అని తన అంతరంగంలోని స్పందనను తెలియజేసింది.

వినోద్ మనస్సుకు పరిమళభరితమైన చల్లని గాలి సోకినట్లయింది. తన్మయత్వం కల్గింది లావణ్యను ఒక్కసారి తన గుండెకు హత్తుకుని, అంతలోనే వివేకం మేల్కొల్పగా, ఆమెను లలితంగా దూరంగా జరిపి —

''లావణ్యా — రాత్రయింది ఇంట్లోకి పోదాం పద,'' అని ఆమె చేతిని పట్టుకుని ఇంటివైపుకు నడిపించేడు.

అదే సమయంలో క్రింద గది కిటికీ వద్ద నుంచున్న భూషణం ఈ దృశ్యం చూసేడు. గతుక్కుమన్నాడు. చాలా గాభరాపడిపోయేడు. ఆ సమయంలో ఏం చెయ్యాలో తోచలేదు దీని పరిణామం ఎలాగుంటుందో అని చాలా భయపడిపోయేడు.








# రుహొల్లా

''అయోతుల్లా' అన్నది బిరుదు అసలు పేరు ''రుహొల్లా'' అయోతుల్లా రుహొల్లా ఖొమెయిన్ రాష్ట్రంలో పుట్టాడు కనుక 'ఖొమెయిని'' అన్న పేరు వచ్చింది

ఈయన మాతామహుడు, తండ్రి ఇద్దరూ ''అయోతుల్లా''లే అంటే మతాధికారులే వీరందరూ ఇస్లాంలోని ''షియ'' మతానికి చెందినవారు

తండ్రి మొస్తాఫా మౌస్సవీని ఒక భూస్వామి చంపించివేశాడు తండ్రి పోయినప్పుడు రుహొల్లాకి కొన్ని నెలలు మాత్రమే

రుహొల్లాని పెంచినవారు అతని తల్లి, మేనత్త మేనత్తే తన సోదరుడి హంతకుడిని వేటాడి మరణశిక్షకి గురిచేయించింది

రుహొల్లా చదువులు తన అన్న అయోతుల్లా సాస్సాడిడే కింద సాగాయి

రుహొల్లా ఎంతో నిరాడంబరంగా, సన్యాసిలాగ జీవిస్తాడు రోజుకి అయిదారు గంటలకన్నా నిద్రపోయి ఎరుగడు ధ్యానం, కొరాన్ పఠనం అతనికి ఇష్టం

మాజీ ''షా'' రుహొల్లాని 1963 లో ఎరెస్టు చేయించాడు ఇతని నిర్బంధానికి నిరసనంగా ప్రదర్శనలు జరిపినవారిమీద కాలుపులు జరిపి [10,000 మంది పోయారని వదంతి] జనరల్ ఒవెయిస్సీ ''కసాయివాడ''న్న బిరుదుని తెచ్చుకున్నాడు

ఏమయితేనేమి రుహొల్లాని 1964 లో విడుదల చేశారు

ప్రస్తుతం 'షా' ఈజిప్టులో వుంటున్నాడు ఆ దేశంలో పత్రికలు అయోతుల్లా రుహొల్లా ఖొమెయినీని ''జయిమ్'' (మహానుభావుడు) అని వర్ణిస్తున్నాయి ఈ వర్ణన ఇంతదాకా ఒక్క అబ్దుల్ గమాల్ నాసర్‌కి మాత్రమే చెల్లేది

1900 లో పుట్టిన రుహొల్లా ఇస్లామ్ మతమే ప్రధానం అన్నప్పటికీ ''నిర్బంధంలేకుండా, తేటగావున్న మనస్సులో చర్చలు జరుపుకుంటే ఇస్లామ్ సిద్ధాంతాలకి బాగా అనుగుణంగా వుండే సిద్ధాంతాలు తెలుస్తాయి,'' అని కూడా అంటాడు

[ ఒ వి ]

# జీవిత మాధుర్యం

వినోద్ లావణ్య మేడపైకి వెళ్ళేరు లావణ్య గది ముందర ఆగేరు ''గుడ్‌నైట్ లావణ్యా!'' అని చేతితో మృదువుగా లావణ్య బుగ్గను తాకి చరచరా నడిచి తన గదిలోకి పోయేడు లావణ్య తన గది ద్వారం వద్ద ఒక్క క్షణం ఆగి వినోద్ వైపు ప్రేమగా చూసి తన గదిలోకి పోయి తలుపేసుకుంది

వినోదమూర్తి బట్టలు మార్చుకుని మంచం మీద పడుకుని సిగిరెట్టు కాలుస్తూ మళ్ళీ ఆలోచనల్లో పడ్డాడు ఆ ఆలోచనలు లావణ్య గురించి కాదు తన గురించి, తన హైదరాబాదు జీవితం గురించి, తనవారి గురించి మధ్య మధ్య ఏదో విషయం జ్ఞాపకానికి వచ్చి మనస్సులోనే నవ్వుకున్నాడు

క్రింద గదిలో రాజభూషణం అప్పుడే ఇంటి పనులన్నీ ముగించుకుని తలుపులు వేసుకుని వచ్చిన భార్యతో అన్నాడు —

''విశాలా ! నాకేమిటో జంకుగా ఉందోయ్ ''

''దేనికని ?''

''నీకెలా చెప్పాలో తెలియడంలేదు ''

'ఏమైందండీ – లావణ్య గురించేనా ?''

''అదే నీకెలా తెల్సు ?''

''ఏమిటి తెలియడం ? నాకు తెల్సిందల్లా మన లావణ్య, అబ్బాయి వినోద్‌ని ప్రేమిస్తోందని దాని చూపే చెప్తోంది ''

''ప్రేమిస్తే ఫరవాలేదుగాని ఆ ప్రేమ కార్య రూపం ధరిస్తే ప్రమాదం కదా నేనిందాక ఆ తోటలో ఒక దృశ్యం చూసేను అందుకే నాకీ భయం ''

''ఏమిటండీ మీ బాధ – ఏమా దృశ్యం వినోద్, లావణ్య ఏమైనా విపరీతంగా ప్రవర్తించేరా ?''

'అదే విశాలా - వినోద్ తోటలో ఆ గులాబీ చెట్ల దగ్గర నుంచున్నాడు మన లావణ్య వచ్చి అతడి ప్రక్కన నుంచుని అతడి చేతిని పట్టుకుంది అబ్బాయి ఏదో అని అమ్మాయి బుగ్గ నిమిరేడు లావణ్య ఏదో జవాబిచ్చి అతడి గుండెమీద తల ఆన్చింది వినోద్ ఏదో అని లావణ్యను కౌగిలించుకున్నాడు వెంటనే లావణ్యను దూరంగా జరిపి ఏదో అన్నాడు ఇద్దరూ చేతులు ఊపుకుంటూ ఇంట్లోకి వచ్చేసారు ఇద్దరూ మేడపైకి వెళ్ళేరు ఒక వేళ ''

''ఏమిటండీ మీ లేనిపోని అనుమానాలు అబ్బాయి అట్లాంటివాడుకాదు వినోద్ లావణ్యను ప్రేమిస్తున్నాడు అతడు తొందర పాటు మనిషి కాదు ఆ పిల్లని వెన్నెట్లో ఏదో ఉద్వేగం కల్గి అలా చేసి ఉంటాడు — కాని సంస్కారం, వివేకం ఉన్నవాడు తొందర పడి ఏ విపరీతమైన పొర బాటూ చేయడని నాకు తెల్సు నా మనస్సు చెప్తోంది మీరు తొందరపడి వినోద్‌ని ఏమీ అనకండి అనవసరంగా రసాభాస అవడమే కాదు, అబ్బాయి మనస్సు గాయపడ్తుంది ''

''ఛీ, ఛీ! అంత అనుమానం నాకు లేదు గాని, అమ్మాయి కొంత జాగ్రత్తగా ఉండడం మంచిదేమో ఎటునుంచి ఎటు వచ్చినా గాయపడేది అమ్మాయే కదా ? అందుచేత అమ్మాయిని నువ్వు హెచ్చరించడం మంచిదనుకుంటా ''

''ఏమని హెచ్చరించమన్నారు ? అబ్బాయిని ప్రేమించవద్దనా -- అబ్బాయితో మాట్లాడవద్దనా లేక అబ్బాయికి దగ్గరగా వెళ్ళొద్దనా ? దానివల్ల ఏమౌతుందంటే అభివృద్ధిచెందుతున్న వాళ్ళ ప్రేమ కుంటుపడుతుంది — లేకపోతే అసహజంగా పరిణమిస్తుంది ఒద్దు మనం కలుగజేసుకోక పోవడమే మంచిది మనం ఈ దశలో బయటపడితే వాళ్ళకు ఇబ్బందిగా వుండడమేకాదు, మనకు వికృతంగానే వుంటుంది పరిస్థితి అమ్మాయిని మాత్రం నేను నా దృష్టిలో వుంచుతా అంతమటుకే నేను చేయగలంది

మీరే అన్నారుకదా అబ్బాయి దేముడులాంటి వాడు, మనందరికీ ప్రాణంపోసేడని ఒకవేళ ఆ చేతోనే అబ్బాయి ఆ ప్రాణాన్ని తీసెయ్యదలుస్తే అలాగే కానీండి — మనం మరేమీ చెయ్యలేం ''

''అదికాదు విశాలా! అబ్బాయిమీద నాకు చాలా నమ్మకం వుంది కాని వాళ్ళిద్దరూ వయస్సులో వున్నవాళ్ళు వివేకవంతులైనప్పటికి పొరబాటు జరగవచ్చు అందుకే మనం ఏం చేయాలి అన్నది ప్రశ్న పోనీ పెండ్లి ప్రస్తావన తెద్దామంటే అబ్బాయి యింటి సంగతి మనకేమీ తెలియదు అబ్బాయి మనస్సులో ఏముందో! మన స్థితిగతులేమీ అబ్బాయికి తెలిసినట్టులేదు అందుకే అబ్బాయికి మన పరిస్థితిని వివరంగా త్వరలోనే చెప్పదల్చేను తర్వాత అబ్బాయి విషయం పూర్తిగా తెల్సుకుని, లావణ్య పెండ్లి సంగతి అడుగుదామనుకుంటున్నాను - ఏమంటావు ?'

''నా ఊహ ఏమంటే అబ్బాయి వినోద్‌కి మన స్థితిగతులన్నీ పూర్తిగా తెలిసేవుంటాయి — లేకపోతే ఇన్నివిధాల మనకి సహాయం చేయడానికి ఎలా పూనుకున్నాడు ? మనకి తన సహాయం యెంతో అవసరమని అబ్బాయి గ్రహించగల్గేడు మనం చెప్పకపోయినా ఊరులో ఎవరో చెప్పేవుంటారు అన్నివిషయాలు తెలియబట్టే ఆ భగవంతుడి దయవల్ల అబ్బాయి వినోద్

# ప్రశ్నావళి

**-కె. రామలక్ష్మి**

ఎమ్ ఎస్ — మద్రాసు

నా పెండ్లికాని వయస్సులో నా భర్త నన్ను ప్రేమగా చూచుకుంటారని కలలుకన్నాను కాని భర్త అనురాగం లేదు బిడ్డ ప్రేమ లేదు అత్త మామల ఆదరణ లేదు నన్నేం చేయమంటారు ?

★ అనుభవించు అని అనలేను పోనీ అని యింకే సలహా యివ్వలేను సోదరీ, కాని ఒక్కటి చెప్పగలను పడివున్నంతకాలమే అణగదొక్కుతారు కాస్త పౌరుషం చూపించడం అలవాటు చేసుకోవాలి పెళ్లికాని వయసులో ఊహాలోకాల్లో కాకుండా వాస్తవ జీవితానికి దగ్గిరగా ఆలోచనలు సాగించివుంటే ఊహకీ వాస్తవానికీ — ఇంత తేడా కనిపించివుండదు జీవితం సినిమా ప్రేమికుల జీవితంలాగా సాగదు సంసారంలో మనస్పర్థలు, మాటా మాటా అనుకోడాలు అన్నీ ఒక భాగమే ఎటొచ్చీ — ఒకరిపై యింకొకరికి కాస్తేనా గౌరవం వుంటే—ముఖ్యంగా భార్యలమీద భర్తలకి— ఈ చిన్న చిన్న తుంపరలు గాలివానగా తయారవవు సరికదా సాంసారిక జీవనసౌధపు పునాదులను గట్టిపరుస్తాయి అందుకే — సంసారం, జీవించడం కూడా ఒక కళే అన్నారు

జె ఎమ్ ఎన్ ఆర్ — బళ్లారి

తప్పుడు అడుగువేసే ఆడదాన్ని హెచ్చరించినా తిరిగి అదే దారిలో నడిస్తే మీరు ఏవిధంగా సమర్థిస్తారు ? ఏమంటే మీరు స్త్రీ పక్షంవారు కదా ?

★ అయితే — మూర్ఖులను సహించడం నాకు అలవాటులేదు !

కె వి ఎస్ — భువనగిరి

కన్న ప్రేమ గొప్పదా ? పెంచిన ప్రేమ గొప్పదా ?

★ భల్లూకపుపట్టులాగ తయారుకానంత వరకు — ఏ ప్రేమ అయినా గొప్పదే !

వి ఆర్ — తాడేపల్లిగూడెం

మనిషి ఆశాజీవి కాకపోతే ?

★ కథే లేదు — అదే మనిషి కథ

డి ఎన్ ఆర్ — మిట్టపల్లి

ఆనాడు స్త్రీని దేవతతో పోల్చారు కాని ఈనాడు అంగడిబొమ్మగా మార్చారు

★ పేరులో మార్పేకాని స్త్రీ స్టేటస్‌లో మార్పేం కనబడ్డంలేదులెండి దేవతకేనా, అంగడి బొమ్మకేనా — అంగాంగవర్ణనే కద !

జి ఎస్ పి ఆర్ — పాలకొల్లు

గాజులు తొడిగించుకొన్నవారు అసమర్థులని— స్త్రీ జాతిని కించపరిచే సమాధానం మీనుండి రావడం విచారకరం మిమ్మ మీరే తక్కువ చేసుకొని పురుషజాతి ఆధిక్యతను గూర్చి వాపోవడం ఏం సమంజసం అంటారు ?

★ మహాశయా ! 'గాజులు తొడిగించుకోడం' అన్న నానుడి చేతులు ముడుచుక్కూచోవడం, చేతకానితనం ప్రదర్శించడానికి వాడేది అంతేకాని— గాజులచేయి కాదు ! (అయినా గాజులు బానిస చిహ్నాల అవశేషాలనికదా సాంఘిక శాస్త్రవేత్తల మాట వేసుకున్నా అవసరమైతే ఆత్మరక్షణకి పనికివచ్చే సంతాల్స్, కోయ, మొదలైనవారి 'కడా'లు వేసుకోవాలిగాని ఈ చిట్లేచిట్లని గాజులు దేనికి ?!)

ఎల్ పి సిహెచ్ — ధర్మవరం

మన జనాలు ఊళ్ళో దేవుళ్ళకన్నా యాక్టర్లు వస్తే తండోపతండాలుగా తరలివస్తారు ఏమిటి ఆకర్షణ ?

★ ఊళ్ళో దేవుడు ఎక్కడికీ పోడు కాని ఈ తారలు రాకపోక తెలియదుకద — వార్త అందగానే — పరుగెత్తాలిమరి ఇక ఆకర్షణ అంటారా — సినిమా తప్పించి యింకో వినోదం ఏముంది సామాన్యులకి ?

టి జి. — అక్కుపల్లి

ప్రతి మనిషి తన జీవితంలో ఏదో సాధించాలని అనుకొంటాడు కాని ఒక్కటికూడా పూర్తిగా సాధించలేకపోతాడు ఎందుచేత ?

★ కృషిలోపం అపజయాల మెట్లన్నీ ఎక్కుతూనే విజయాన్ని సాధించడం జరుగుతుందన్న బుర్లి నిజం మరిచిపోయి — తొలి అపజయంతో కృంగిపోతాడు

జె ఆర్ — పాల్తూరు

నన్ను చూసినప్పుడల్లా 'చిలకకొట్టుడు కొడితే చిన్నదానా ?' అంటూ పాడుతాడు నేను ఏమనాలి ?

★ నువ్వేం ఎన్ టి ఆర్ కాదు — నేనేం జయప్రదనో సుధనో కాదు — నోరు మూసుకో' మనాలి — అంతకంటే ఏం చేయకలరు అమ్మాయిలు? (లేకపోతే ఉత్తరాది అమ్మాయిల్లాగా కరాటేపట్లు నేర్చుకుని - దగ్గిరకి రానిచ్చి - నేఁ కరిపించాలి )

వి ఆర్ — అనంతపురం

ప్రశ్నావళిలో ఎక్కువ కొంటెప్రశ్నలు వేస్తూంటారు మీకు బాధ అనిపించదా ?

★ బాధెందుకు? కొంటెతనం కసికాదు ●

---

హృదయమంతా మనయందు కరుణతో నిండిపోయింది ఎన్నల్ని ఈవిధంగా పునర్జీవితుల్ని చేసి, ఈ సమాజంలో మళ్ళీ మనం గౌరవనీయులైన వ్యక్తులుగా తలెత్తుకుని తిరిగేటట్లు చేసేడు సరే మీ మనస్సు తృప్తికేనా మీరన్న విధంగా చెయ్యండి - కాని ఏ పరిస్థితిలోనూ అబ్బాయి మనస్సు బాధపడేటట్లు మాత్రం పొరబాటున్నైనా మాటను జారనీయకండి ''

''ఎంతమాట ! అబ్బాయి అంటే నాకు మాత్రం ప్రేమ లేదను కొంటున్నావా ? అబ్బాయి మనస్సు గాయపడితే నా మనస్సు కోసుకున్నట్లేగా నీకా భయం అక్కరలేదు అబ్బాయి వినోద్ మనకి అల్లుడైతే అంతకుమించి నాకీ జీవితంలో కావల్సిందేముంది — చెప్పు ?''

''నా మనస్సులోనూ అదే కోరిక ఉందండి భగవంతుడు నా ఈ కోర్కెను నెరవేరుస్తే నేనెంతో సంతోషిస్తాను అప్పుడు కొంతైనా ఋణం తీర్చుకున్న వాళ్ళమౌతాము ఆ బాంధవ్యం వల్ల ''

''అబ్బాయి చాల ఉత్తముడు మనమంటే ఎంతో అనురాగం కలవాడు మంచి సంస్కారి వయస్సు చిన్నదైనా మనస్సు చాల మిన్న లావణ్య అదృష్టం యెలాగుందో చూడాలి ''

''లావణ్యంటే అబ్బాయికి ఎంతో ప్రేమ అమ్మాయి కోసమే ఆ గులాబీ తోట వేయించేడు అబ్బాయి వినోద్ తప్పక లావణ్యను పెండ్లాడు తాడని నా మనస్సు చెప్తూంది ''

మేడమీద వినోదమూర్తి ఇవేమీ తనకు పట్ట నట్లుగా ప్రశాంతంగా నిద్రపోతున్నాడు లావణ్య తన గదిలో చెల్లెలు వనజ మీద చెయ్యి వేసుకుని పరుండి ఏవేవో తియ్యని కలలు కంటూంది

*[ఇంకా వుంది]*



'అందం—అనుభవం' లో కవిత

# సినిమా విశేషాలు

## నరుడా ! ఏమి నీ కోరిక ?

అందరికీ అర్థమయ్యే మకుటం ''పాతాళభైరవి'' చిత్రంలో అనేకసార్లు వినిపించిన **వాక్యము** ఇట్టి సులభగ్రాహ్యమయ్యే మకుటాన్ని, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మాత శ్రీ ఏ వి సుబ్బారావు, తన కొత్త వర్ణ చిత్రానికి పెట్టారు

అందరినీ ఆకట్టుకునే, ఆకర్షణీయమైన అంశాలు ఎన్నో వున్న ఈ చిత్రానికి శ్రీ సి ఎస్ రావు కథ మాటలు సమకూర్చారు



'బంగారు చెల్లెలు'లో శోభన్‌బాబు, జయసుధ

మొదటి షియరింగులోనే, శ్రీ అక్కినేని గ్రీన్ సిగ్నల్ ఇచ్చిన జనరంజకమైన ఈ కథలో, ఆయన కొత్తతరహా పాత్రను పోషిస్తున్నారు

''ఫిబ్రవరి మార్చి ఏప్రిల్'' నెలలో షూటింగు పూర్తవుతుందని, దర్శకుడు శ్రీ ప్రత్యగాత్మ తెలిపారు

''నరుడా! ఏమి నీ కోరిక'' వర్ణ చిత్రంలో రావుగోపాలరావు అల్లురామలింగయ్య పాత్రలు ఆద్యంతం నవ్వుల వర్షాన్ని కురిపిస్తాయి

ఈ చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని, సెల్వరాజ్ ఛాయాగ్రహణాన్ని, కృష్ణస్వామి కూర్పును, జి వి సుబ్బారావు శిల్పాన్ని, **పూర్ణ**చంద్రరావు ప్రొడక్షన్ను, డి వి ఎస్ రావు సహదర్శకత్వాన్ని, మోహన్‌గాంధీ కో...డైరెక్షన్ను నిర్వహిస్తున్నారు

శ్రీ ప్రత్యగాత్మ చిత్రానువాదం దర్శకత్వాన్ని నిర్వహిస్తున్న నరుడా! ఏమి నీ కోరిక? వర్ణ చిత్రానికి ఓ కొత్తమ్మాయిని నాయికగా ఎంపికచేసే వుద్దేశ్యం, నిర్మాత సుబ్బారావుగారికి వున్నది ఎవరో, ఆ అదృష్టవంతురాలు ఈ చిత్రానికి నవయుగ పంపిణీ దారులు

## మాణిక్యవీణ ఒక మధురకావ్యం !

విఖ్యాత చిత్ర నిర్మాత శ్రీ ఎమ్ ఎస్ రెడ్డిని యిటీవల కలిశాను అప్పుడు ఆయన, తను వ్రాసిన ''మాణిక్యవీణ'' కథను, విశ్రాంతి విభాగం వరకు సంభాషణలతో చదివి వినిపించారు

ఒక మధురకావ్యంగా, ఒక అపురూప శిల్పసుందరిగా, ఒక మహాకవి హృదిగా పేర్కొనాల్సి ఎన్ని మధురఘట్టాలో, వర్ణించడం ఈ కలానికి శక్యంకాని పని

కథలో నాలుగు ప్రధాన పాత్రలున్నాయి ఒక పాత్రతో మరొకటి పోటీపడేవిధంగా, ''సహజకవి'' మల్లెమాల ఆ పాత్రలను **రూపొందించారు**

శ్రీ నాగేశ్వరరావు వంటి నవరసనాయకుడు, శ్రీ శివాజీగణేశన్ వంటి అద్వితీయ నటుడు వెయ్యదగిన పాత్రలను అపాత్రదానం చెయ్యనివ్వని, దేవుడ్ని అభినందించాలి

''మాణిక్యవీణ'' చిత్రం తెలుగు చలనచిత్ర రంగంలో చిరస్థాయిగా నిలిచిపోతుంది

కళ్యాణవర్మ గురువు, గోపీ శిష్యుడు, రాధ గోపీ మరదలు, గీత కళ్యాణవర్మ ఏకైక కుమార్తె (తల్లిలేని పిల్ల)

''మల్లీశ్వరి దేవదాసు మూగమనసులు'' వంటి ఉత్తమజాతి చిత్రంగా ''మాణిక్యవీణ'' ప్రేక్షకుల ''జేజే''లను అందుకుంటుంది

శ్రీ ఎమ్ ఎస్ రెడ్డి రసరచనా రమణీయతకు ''మాణిక్యవీణ'' ప్రత్యక్ష నిదర్శనం.

ఆయన అదృష్టవంతుడు, గనుకనే ... ''మాణిక్యవీణ'' అపాత్రదానం కాలేదు.

## కడుపుబ్బ నవ్వించిన వినోదాల చిత్రం

శ్రీ లక్ష్మీనరసింహా ఇంటర్నేషనల్ డిశంబరులో ప్రారంభించిన ''పెద్దిల్లు–చిన్నిల్లు'' చిత్రం **పూర్తి**కావచ్చింది.

పదమూడు రీళ్ళు **పూర్త**యిన ''పెద్దిల్లు – చిన్నిల్లు'' చిత్రాన్ని చూచే అవకాశం యీ రచయితకు వచ్చింది.

తొలి దృశ్యం ప్రారంభంనుంచి, 13 వ రీలు **పూర్త**య్యేవరకు ... కడుపుబ్బ నవ్వించింది

''పెద్దిల్లు – చిన్నిల్లు'' చిత్రం శ్రీ దాసరి నటనాప్రాభవ ప్రదర్శనానికి ప్రత్యేక నిదర్శనంగా ప్రేక్షకుల ఆశీ అక్షింతలను పొందుతుంది.

అమ్మబాబోయ్! శ్రీ దాసరి నటనలో ఎంత యీజు...ఎంత నాచురాలిటీ...ఏమి టైమింగు... ఏమి మాడ్యులేషను. ''హ్యాట్స్ ఆఫ్ టు హిమ్.''

దర్శకుడుగా ఎవరెస్టు అంత ఎత్తు ఎదిగిన శ్రీ దాసరి నటుడుగా అంతే దశను అనుభవించగలరు ... ''పెద్దిల్లు – చిన్నిల్లు'' విడుదల తర్వాత.

శ్రీ ఎం. కె. మావుళ్ళయ్య నిర్మిస్తున్న ఈ రంగుల హాస్య చిత్రానికి కథ మాటలు చిత్రానువాదాన్ని శ్రీ దాసరి సమకూర్చ సత్యం సంగీతానికి, భాస్కరరాజు శిల్పానికి, బోసుబాబు స్వామి ప్రొడక్షన్ శాఖకు, బాలు కూర్పుకు హరిశ్చంద్రరావు సహకార దర్శకత్వానికి, అన్నారావు నిర్మాణతకు ఆధిపత్యం వహిస్తున్నారు

మార్చి 9న విడుదలకానున్న ఈ నవ్వుల చిత్రంలో మోహన్‌బాబు, ప్రభ, దీప, కె వి చలం, అత్తిలి లక్ష్మి, జి వి జి ప్రధాన పాత్రధారులు

శ్రీ దాసరి నిర్దేశకుడు శ్రీ ఎన్ ఆర్ రేలంగి కో డైరెక్టరు లక్ష్మి సుపర్ణ శ్రీ తారకరామ పంపిణీదారులు

## జి. ఏ. జి. పే జీ

### సింగపూర్‌లో తొలి తెలుగు చిత్రం అందమైన అనుభవం

"కథకు సింగపూర్‌తో ముడిపడివున్న కారణంగా అక్కడి ముఖ్య ప్రదేశాలైన విక్టోరియా సెంటర్, పీపుల్స్‌పార్క్, శాంటోజ్ ఐలండ్ వగైరా సుందర ప్రదేశాలలో ముఖ్యమైన సన్నివేశాలను చిత్రీకరించాం," అన్నారు ప్రేమాలయా కంబైన్స్ పతాకంలో వెంకట్రామన్ నిర్మించిన "అందమైన అనుభవం" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ భారాలను వహించిన కె. బాలచందర్. జయప్రద, కమలహాసన్, రజనీకాంత్ ముఖ్య భూమికలు నిర్వహించారు. గణేశ్‌పాత్రో సంభాషణలకర్త. 9 ఆత్రేయ గీతాలకు ఎం. ఎస్. విశ్వనాథం



'కెప్టెన్ కృష్ణ'లో శ్రీప్రియ

మధురమైన బాణీలు కూర్చారు. బి. ఎస్. లోకనాథ్ ఛాయాగ్రాహకుడు. మార్చి మొదటివారంలో విడుదల.

### డాక్టర్లు కావలసిన దర్శక నిర్మాతలు

డైరెక్టర్ టి. లెనిన్‌బాబు బి. ఎస్‌సి. అయ్యాక మెడికల్ కాలేజ్‌లో చేరి, మానేశారు. ఇంటర్మీడియెట్‌లో ఫస్ట్‌క్లాస్‌లో పాసై, బి. యె, లో ఇంగ్లీష్‌లో యూనివర్సిటీ ఫస్ట్‌గా వచ్చిన నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావుగారికి మద్రాసు మెడికల్ కాలేజ్‌లో సీట్ వచ్చింది. కాని, ఆ సమయంలో వారి తండ్రిగారి అస్వస్థత మూలంగా మెడిసిన్ చదవడానికి వీలుపడలేదు.

# ఎన్నో కప్పుల కమ్మని చిక్కని టీ కోసం






మా కుటుంబానికి,
ఎన్నో కప్పుల కమ్మని
చిక్కని టీ--రుబికి
మా కృతజ్ఞతలు !

**లిప్టన్ రుబి డస్ట్**

LRDC/CAS-1/78 TEL



'ఇంటింటి రామాయణం' లో ఒక దృశ్యం

## * జి. వి. జి. పేజీ *

### "ఎవడబ్బ సొమ్ము"లో బయటపడ్డ నిజం

ఎస్ పి (సత్యనారాయణ) విసురుగా హాల్లోకి వచ్చాడు ఆవేశంతో అక్కడ అలమారులోని మెడల్స్, ట్రోఫీలను విసిరి పారేస్తుండగా అతని భార్య పార్వతి (జానకి), కూతురు రాణి (కవిత) వచ్చి, నిర్ఘాంత పోయారు

"ఏమిటండీ ? ఏం జరిగింది ? ఇవి మీ పేరు ప్రతిష్ఠలకు ప్రతిరూపాలు పోలీసాఫీసర్‌గా మీ నిజాయితీకి నిదర్శనాలు వీటినిలా పారేస్తున్నా రేమిటి ?" అని అడిగింది పార్వతి

"నా పేరు ప్రతిష్ఠలు భంగమయ్యాయి గనుక, నా నిజాయితీకి నిప్పంటుకుంది గనుక, కన్నతండ్రికే ద్రోహం చేసే కూతురు నీ కడుపున పుట్టింది అపరాధుల్ని పట్టుకునేందుకు ప్రాణాలకైనా తెగించే నన్ను అపరాధిగా పై అధికారుల ఎదుట నిలబెట్టింది ఇప్పుడు నేను కర్తవ్యం కోసం కన్నబిడ్డనైనా వదులుకునే పోలీసాఫీసర్ని కాదు, పార్వతీ ! హంతకుడు నా కొడుకు గనుక వాడికి సాయపడే వ్యక్తిని, ఒక ఖైదీని కస్టడీలోంచి తప్పించిన నేరస్థుడ్ని", అంటూ ఎస్ పి, కూతురు వంక తిరిగి, "చెప్పు ! ఎవరా విజయ్ ? వాడిమీద నీకింత అభిమానం ఎందుకు ? - వాడు అడుగడుగునా నాకు అడ్డు పడుతున్నాడు నేను హంతకుడ్ని పట్టుకోలేక పోవడానికి కారణం వాడే ఆ విజయ్‌ను చంపైనా సరే, హంతకుడ్ని పట్టుకుంటాను" అన్నాడు

పార్వతి దుఃఖాన్ని దిగమింగుకోలేక "చంపండి ! ఒక కొడుకును హంతకుడిగా అనుమానించి వెంటాడుతున్నారు రేపో మాపో వాడు దొరుకుతాడు ఉరికంబ మెక్కిస్తారు ఆ గొప్ప చాలదటండీ ? ఈ కొడుకును కూడా స్వయంగా మీ చేత్తో చంపేస్తే, ఇంకా ఘనమైన కీర్తి వస్తుంది కర్తవ్యం కోసం కన్నబిడ్డల్ని కాల్చి చంపిన మహానుభావుడని మిమ్మల్నందరూ పొగుడుతారు ఆ పొగడ్తల్నే పూలమాలలుగా వేసుకొని బ్రతకొచ్చు", అంది

ఎస్ పి, అయోమయంగా చూస్తూ, "అంటే, విజయ్ ?" అని ఆగాడు

పార్వతి అప్పటికి నిజాన్ని బయట పెట్టక తప్పలేదు "మన ప్రేమఫలం ఆ తర్వాత మీరు ఫారిన్ వెళ్లారు వస్తానన్న టైమ్‌కి తిరిగి రాలేదు ఈలోగా విజయ్ పుట్టాడు పెళ్ళి కాకుండానే బిడ్డ పుట్టడం ఏ అనుమానాలకు ఆస్కారమిస్తుందోననే భయంతో మా అమ్మ — నాకు చెప్పకుండానే ఆ పసికందును ఎవరికో పెంచుకోమని ఇచ్చేసింది అప్పట్నించి వాడెక్కడున్నాడో తెలుసుకోలేక పోయాను ఇప్పుడు తెలుసుకున్నాను మీ బిడ్డలు అపరాధులు కారండీ వాళ్ళ నిర్దోషిత్వం నిరూపించడానికి కన్నతండ్రిగా మీరు తోడ్పడండి"

"నీ నమ్మకం ప్రకారం వాళ్ళు నిరపరాధులైతే, నేను తోడు పడనవసరంలేదు దైవమే వాళ్ళకు సాయపడతాడు నాకు సంబంధించినంత వరకు నేను చట్టానికి బద్ధుడ్ని ఇది చట్టానికి— నేరానికి జరుగుతున్న పోరాటం ఇందులో చట్టం జయించవలసిందే అందుకోసం అవసరమైతే నేను చావడానికైనా సిద్ధమే, చంపడానికైనా సిద్ధమే !" అన్నాడు ఎస్ పి

కృష్ణ హీరోగా కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో అలపర్తి సురేంద్రనాథ్, వాసిరెడ్డి నాగేశ్వరరావు నిర్మించే "ఎవడబ్బ సొమ్ము" స్కోప్ కలర్ చిత్రంలో శ్రీప్రియ నాయిక త్రిపురనేని మహారథి రచయిత ఎస్ ఎస్ లాల్ ఛాయాగ్రాహకుడు

### "శివకేశవులు" మార్చి విడుదల

"జనవరి 15 నుంచి 22 వరకు చిత్తూరు, మదనపల్లి మధ్యలో సరికొత్త పంథాలో పతాక సన్నివేశాలను చిత్రీకరించాం," అని తెలియజేశారు డైరెక్టర్ జి సి శేఖర్ మురళీమోహన్, చంద్రమోహన్, ప్రభాకరరెడ్డి, రాజ్‌బాబు, ప్రభ, జయమాలిని, పండరీబాయి, విజయలక్ష్మి పాత్రధారులు సత్యానంద్ రచన, చక్రవర్తి సంగీతం, కన్నప్ప ఛాయ, రాజేంద్రకుమార్ శిల్పం, కోటగిరి గోపాలరావు కూర్పు, జాస్తి నిర్వహణ గల ఈ మారుతీ ప్రొడక్షన్స్ తాజా వర్ణచిత్రానికి అడుసుమిల్లి లక్ష్మి కుమార్ నిర్మాత

'ప్రెసిడెంట్ పేరమ్మ' లో గోకిన రామారావు, మంజుభార్గవి



ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స

# అంతులేని వింతకథ

కలర్

నిర్మాత **కె.రాఘువ**

కథ-మాటలు-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం

**మోహన్‌దాస్**



లక్ష్మీ ఫిలింస్

LAKSHMI DUBS.

## నిర్మాతగా మరో పాత్రికేయుడు

"రేపు" మాస పత్రిక సంపాదకుడు సి. నరసింహారావు నిర్మించే "హరిజన్" చిత్రానికి మలయాళ పత్రికా రచయిత రవీంద్రన్ దర్శకుడు. న్యూ పర్‌స్పెక్టివ్స్ పతాకంలో తయారయ్యే ఈ చిత్రం ఉయ్యూరు సమీపంలో వున్న కపిలేశ్వరపురంలో 12 రోజుల షూటింగ్‌తో పూర్తయింది. అంతస్తు భేదాలు, కులాల అంతరం, హరిజన కుటుంబాల స్థితిగతులను వాస్తవరీతిలో చిత్రీకరించడమే తమ ధ్యేయమని నిర్మాత తెలియజేశారు. మధు ఛాయాగ్రాహకుడు. పద్మనాభన్ సంగీత దర్శకుడు. సంభాషణలు, సంగీతం ఇత్యాది విషయాలలో తాము కొత్తపుంతలు తొక్కామని దర్శకుడు వివరించారు. సరికొత్త నటీనటులు పాల్గొన్న ప్రయోగాత్మక చిత్రమిది.

## నిర్మాతనైనా నేను మేకప్ ఆర్టిస్టునే

బాపు దర్శకత్వంలో జయకృష్ణ నిర్మించిన "మన వూరి పాండవులు" వర్ణ చిత్రం శతదినోత్సవం వైభవోపేతంగా జరిగింది. జయకృష్ణ తొలుత మేకప్‌మన్‌గా చిత్రపరిశ్రమలో ప్రవేశించారు. హీరో కృష్ణంరాజు ఆశీస్సులతో నిర్మాత అయ్యారు. తొలి చిత్రమే అఖండ విజయాన్ని సాధించింది. అయినా, జయకృష్ణలో మార్పేమీ లేదు. ఇంకా మేకప్‌మన్‌గానే శ్రమిస్తున్నారు. "నేడు నన్నింతవాడ్ని చేసింది ఈ మేకప్ కళ. దీనిని విస్మరించగలనా? నేను ఇంకా ఎన్నో చిత్రాలు నిర్మించవచ్చు. కాని, ఈ వృత్తిని మాత్రం వదిలేదిలేదు," అన్నారు జయకృష్ణ.

## తారలు – పబ్లిసిటీలు

"ఫలానా హేర్ ఆయిల్‌నే నేనెప్పుడూ ఉపయోగిస్తాను. ఫలానా సబ్బు నా ముఖాన్ని తళతళలాడేలా చేస్తుంది," లాంటి వాణిజ్య ప్రకటనలలో మన తారల ఫోటోలు పడడం మనం చూస్తున్నాం. ఒక్కోసారి ఇవి లేనిపోని చిక్కులు తెచ్చిపెడుతూంటాయి. హాలీవుడ్ గాయక నటుడు పేట్ బూనీ, అతని కూతురు డెబ్బీ యిలాగే 'చర్మాన్ని మృదువుగా వుంచే ఒక క్రీమ్' ప్రచారానికి ఉపయోగించబడ్డారు. ఆ క్రీమ్ వల్ల అలాంటిదేమీ జరగలేదని, అంతా మోసమని ఒక కస్టమర్ ఫిర్యాదు చేయడంతో ది ఫెడరల్ ట్రేడ్ కమిషన్ దర్యాప్తుకు పూనుకుని, ఆ ఆరోపణ నిజమని నిరూపించింది. తప్పుడు ప్రచారంలో తమ ఖ్యాతిని వినియోగించుకున్నందుకు పేట్, డెబ్బీలు అపరాధం చెల్లించక తప్పలేదు. అలాగే ఒక ట్రావెలర్స్ చెక్‌ల పబ్లిసిటీలో తోడ్పడినందుకు కారల్ మాల్డెన్ అనే నటుని మీద న్యాయస్థానం చర్య తీసుకుంది. మన దేశంలో కూడా ఇటువంటి వార్తలు ఎప్పుడైనా వినబడతాయేమో! అంచేత, తారలు తగు జాగ్రత్తల్లో వుండడం ఎందుకైనా మంచిది.



# అర్చన

వేదుల మీనాక్షీదేవి

**వరలక్ష్మి గృహలక్ష్మిగా మారి పదిహేను సంవత్సరాలైంది భర్త శ్రీకాంత్ మెడికల్ రిప్రజెంటేటివ్. ఇద్దరు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు**

వరలక్ష్మి చిన్నప్పటినుండి స్వార్థపరురాలు ఎంతసేపూ ఎదటివారు తనకేం చేశారు ? అనే ధోరణే! ఈతగింజ వేసి తాటిగింజ లాగే ఆత్యాశాపరురాలు ... తన గురించి చెడ్డగా యెవరైనా అనుకుంటున్నారేమోనన్న ఆలోచన ఆమె కనవసరం. ఎవరేమనుకున్నా ఆమెకు లెక్కలేదు. ఎదటివారిని చిన్నచూపు చూసే లక్షణం చాలా వుంది.

చిన్నప్పుడు గొప్పవారి పిల్లలతో స్నేహం చేసేది. వాళ్ల యిళ్ళకు వెళ్లేది ... తన యింటికి రమ్మని వాళ్ళని ఆహ్వానించేది. ఆవతలవారివల్ల లాభం వుంటేనేగాని స్నేహం చెయ్యాలనిపించేది కాదు.

క్రమంగా వయసు ముదిరినకొద్దీ ఈ లక్షణాలు యెక్కువకావడంతో ఒకవిధమైన గర్వరేఖ పొడచూపింది భర్త ఇంట్లో ప్రవేశించాక. ఇరుగుపొరుగువారితో కబుర్లు చెప్పేది. మాట్లాడేటప్పుడు కళ్ళూ, చేతులూ తిప్పుతూ చమత్కారంగా మాట్లాడుతున్నాననే భావం ఆమెలో గోచరించేది. ఏ వయసువారితో ఆ వయసు దానిలాగ ప్రవర్తించేది ఎదుటివారిని ఆకాశానికి యెత్తేసినట్లు మాట్లాడ్డం, వారు వెనుతిరగ్గానే అంత చెడ్డవాళ్ళు లేరని, వున్నవీ లేనివీ యెన్నో కల్పించి నేరం చెప్పేది. ఆమెకు అది వెన్నతో పెట్టిన విద్య. ఏ ఇద్దరు సుఖంగావున్నా వారి మధ్య వైషమ్యాలు లేవదీస్తేగాని ఆమె కళ్ళు చల్లబడేవికావు. మనసు కుదుటబడేదికాదు !

చిన్నపిల్లల మనోవికాసానికీ, విజ్ఞానాభివృద్ధికీ దోహదం చేసి, విద్యపట్ల వారి కాసక్తి కలిగించేందుకు అంతటా ఆదర్శ శిశు విద్యాలయాలు వెలిశాయి. కాస్త ఖర్చుపెట్టగలిగినవారు తమ పిల్లలను చేర్పిస్తున్నారు. వరలక్ష్మి తన పిల్లల్ని అందులో చేర్పించింది. అందుకు రెండు కారణాలు.

ఇంట్లో నిత్యం జరిగే వాలి సుగ్రీవ యుద్ధం వుండదు — అధమం ఉదయం నుండి సాయంత్రం వరకు అన్నది మొదటిది.

ఇక రెండవది : సంఘంలో, తన యిరుగు పొరుగువారిలో తన ఆధిక్యత కనబడాలి ... తన భర్త సంపాదన చెప్పుకోతగినంతగానే వుంది. ఏమీ పనిలేనట్లుగానూ, ఏమీ చెయ్యనట్లే అనిపిస్తుంది. ఆ వ్యక్తి వూళ్ళో వుంటే ఎంతో పని వున్నట్లు, ఆనాడే సుష్టుగా వంటా వగైరా చేసినట్లు ఫీలవడం జరుగుతుంది. అతను వూళ్ళో లేనప్పుడు మరీ కాలం గడిచేదికాదు వరలక్ష్మికి. ఏవో పత్రికలు, పుస్తకాలు అద్దెకు తీసుకుని చదివేది. కొత్తలో అత్తమామలు సహాయంగా వుండేవారు శ్రీకాంత్ క్యాంపులో వున్నప్పుడు. క్రమంగా వారికి వచ్చివుండడం వీలుపడ్డంలేదు.

పిల్లలు క్రమంగా పెద్ద క్లాసుల్లోకి వస్తున్నారు. పెద్దపిల్లకి 14 వ ఏడు రెండవ పిల్లకి 12 ఏళ్ళు. మగపిల్లలు 10, 8 ఏళ్ళ వాళ్ళు.

ఆ చుట్టుప్రక్కల పిల్లలతో కలిసి స్కూళ్లకు వెడుతూ వస్తూవుండేవారు. ఒక్కొక్కప్పుడు హోం వర్కు చేసుకుందుకు సాయంత్రం క్లాసు పిల్లలు వీళ్ల యింటికి వచ్చేవారు. కలిసి చదువుకునేవారు.

ఏవైనా సందేహాలు వస్తే వరలక్ష్మి చెబుతూండడం, వచ్చిన పిల్లల్ని ఆశ్చర్యపరచేది.

వరలక్ష్మి ఇంటర్ చదువుతూండేది పెళ్లి

పిల్లలు ఒక్కరోజుకూడా మానకుండా స్కూలుకి వెడుతున్నారు. ఆడపిల్లలు పెద్దవాళ్ళు, మగపిల్లలు చిన్నవాళ్ళు. ఆఖరి పిల్లవాడికి ఎనిమిదేళ్ళు.

ఉదయం పిల్లలను తయారుచేసి భోజనం పెట్టి పంపేసరికి తొమ్మిదిన్నరగంటలయేది. అప్పుడు కాస్త వూపిరి పీల్చుకుందుకు అయేది ... భర్త వూళ్ళో వుంటే ఏదో పనితో రోజల్లా సరిపోతుంది. ఒక్క నిముషం తీరిక వుండదు.

భర్త శ్రీకాంత్ తరుచు క్యాంపులకు వెడుతూంటాడు. ఇంటి యజమాని వూళ్ళో లేకపోయినా వంట, భోజనాలు, ఫలహారాలు వంటివి సక్రమంగా అన్నీ జరిగిపోతూనేవుంటాయి. కాని,

సమయానికి. ఆ తరువాత మానేసింది. ''మా అమ్మగారు చదువుకున్నారు'' అని పెద్దపిల్ల గిరిజ వాళ్లలో చెప్పి వాళ్లని మరింత చకితుల్ని చేసేది.

వరలక్ష్మి యిరుగుపొరుగు యిళ్లకు వెళ్లేది. కబుర్లు చెప్పేది. తమ విషయాలు మహాగుట్టు... అవతలవాళ్ల విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం యెక్కువ. వార్తలు మొదలు వంట, వార్పు వరకు ఆమె చర్చించని విషయం వుండదు.

కొత్తలో బాగానేవుందనిపించినా, క్రమంగా పాడైపోయిన గ్రాంఫోన్ రికార్డులాగా ఒకే పద్ధతిలో, అదే డాంబిక పదజాలంతో, పకపక నవ్వుతూ మధ్య మధ్య ఆనందంపట్టలేక చప్పట్లు కొడుతూ మాట్లాడ్డంపట్ల విముఖత కలిగింది ఆమెపట్ల ఇరుగుపొరుగువారికి. 'ఓహో' అంటే 'ఓహో' అనడంతప్ప జోక్యం కలిగించుకునేవారు కారు. తటస్థవిధానం అవలంబించారు.

* * *

''ఇవ్వాళ మా తమ్ముడి రెండవ పుట్టినరోజు. మీరు తప్పకుండా పేరంటానికి రావాలి. పిల్లల్ని కూడా తీసుకురండి. మా ఇల్లు మీ అమ్మాయి గిరిజకి తెలుసును'' అని వరలక్ష్మికి బొట్టుపెట్టి పేరంటం పిలుపు పిలిచింది మాణిక్యం.

మాణిక్యం గిరిజ క్లాసు పిల్ల, వైశ్య బాలిక. 'తప్పకుండా వస్తానమ్మా' అంది వరలక్ష్మి.

పేరంటానికి వెళ్ళిన వరలక్ష్మిని ఎంతో మర్యాద చేశారు మాణిక్యం యింట్లో వాళ్ళు ఆమె చదువుకున్నదనీ, చీమంత గర్వం కూడా లేదనీ వచ్చిన పేరంటాళ్లతో చెప్పింది మాణిక్యం తల్లి భ్రమరాంబ. వాళ్లింటో వాళ్లనందరినీ వరలక్ష్మికి పరిచయం చేసింది.

లోనికి తీసుకువెళ్లి ఫలహారం,కాఫీ యిచ్చారు. ఇంటికి వెళ్లడానికి లేచింది వరలక్ష్మి.

''రేపు మధ్యాహ్నం మీ యింటికి వస్తాను. తీరుబడేనా మీకు ?'' అడిగింది భ్రమరాంబ.

''తీరికగానే వుంటుంది. తప్పకుండా రండి. ఒకళ్ల యిళ్లకు ఒకళ్లం వస్తూ పోతూ వుంటేనే కదా పరిచయాలు, స్నేహాలు అయేది ? స్నేహం అంటే నేను ప్రాణం యిస్తాను సుమండీ'' అంది వరలక్ష్మి.

మర్నాటి మధ్యాహ్నం వచ్చిన భ్రమరాంబను ఎంతో ఆప్యాయంగా లోనికాహ్వానించింది వరలక్ష్మి. కాఫీ, టిఫిను యిచ్చింది ...

''మిమ్మల్ని ఒక్కమాట అడగాలని వచ్చాను'' అంది భ్రమరాంబ.

''అంత సందేహం యెందుకు ? నా దగ్గర మీకేం మొగమాటం అక్కర్లేదు. అడగదలచుకున్నది నిక్షేపంలాగ అడగండి'' అంది వరలక్ష్మి.

''మా పెద్దమ్మాయి ఎనిమిదవ తరగతి ప్యాసైంది. ఇక స్కూలుకి పంపవద్దని మానిపించేశారు వాళ్ల నాన్నగారు ... పెళ్లైనా చెయ్యాలి. చదువైనా చెప్పించాలి. ఈ రోజుల్లో పిల్ల ఏం చదువుకుంది ?'' అని అడుగుతున్నారు పెళ్లిచూపులలో ఈపరిస్థితులలో మీచేత ప్రైవేటు చెప్పిద్దామని వుంది అమ్మాయికి. ప్రైవేటుగా

# ఆర్జన

మెట్రిక్‌కి కడతామంటోంది. మీరు మా సుధకి ప్రైవేటు చెప్పాలి. మధ్యాహ్నం మా యింట్లో మగవాళ్లు షాపుకి వెళ్లిపోతారు. స్వంత రిక్షా వుంది పంపిస్తాను, మీకు శ్రమ లేకుండా'' అంది భ్రమరాంబ.

వరలక్ష్మికిది అనుకోని విషయం. అభ్యర్థన... ఇది గర్వకారణమైన విషయం. అయినా అంతలో తను తేలిపోకూడదు అనుకుంది.

''నేనెప్పుడూ ప్రైవేట్లు చెప్పలేదు. మా పిల్లలకే ఎప్పుడైనా పాఠాలు చెబుతూంటాను. కాదూ కూడదూ అంటే మీ అమ్మాయిని మా యింటికి పంపండి–'' అంది.

''అలాగ పంపే మాటైతే స్కూలుకే పంపేవారు కదుటండీ వాళ్ల నాన్నగారు'' అంది భ్రమరాంబ.

## అనుభూతి

*డా॥ సి. నారాయణరెడ్డి*

చూస్తున్నాను నేను విభ్రాంతంగా
చుక్కలకు అర్ధరాత్రి
చెమట పోస్తూ వుంటే.

వింటూ వున్నాను నేను
వెర్రెత్తిన వెన్నెముకలో అరిచే
వేదనను ఆత్మీకరించుకుంటూ.

తడుతూ వున్నాను నేను
తలుపుల్లేని చీకటిని తెరిచే
వెలుగు బీగాల కోసం.

నిద్రిస్తున్నాను నేను నీరవంగా
సముద్రం చెరువుల్ని తట్టుకుని
శ్రవణేంద్రియం మేల్కొని వుండగా.

అనుభవిస్తున్నాను నేను
అమృతాన్ని తిరగమోత వేసి
ఆశల దొన్నెల్లో వడ్డిస్తూ వుంటే.

''అయితే మీ అమ్మాయిని సినిమాకి కూడా వెళ్లనియ్యడం లేదేమిటి ? గుమ్మం కదలకుండా బంధించేస్తున్నారా ?'' గలగలా నవ్వింది వరలక్ష్మి.

''సినిమాలకు మేమంతా కలిసే వెడతాంకదా? ప్రైవేటుకని రోజూ ఒక్కపిల్లనీ పంపడానికి ఒప్పుకోరు. మీరే వచ్చి చెప్పాలని నా కోరిక'' అని ప్రాధేయపడింది భ్రమరాంబ.

''మా వారికి క్యాంపు లేనప్పుడు రావడం ఎలాగ కుదురుతుందండి ?'' అంది వరలక్ష్మి.

''అంతగా ఆయన వచ్చినప్పుడు అప్పుడప్పుడు రావడం మానినా ఫరవాలేదు. నెలకు యాభై రూపాయలిస్తాం'' అంది భ్రమరాంబ.

''ఇవ్వాళ మా వారు వస్తారు. ఆయనతో చెబుతాను మీరు చెప్పిన విషయం మీ అమ్మాయి మాణిక్యంచేత కబురంపుతానులెండి'' అని ఆమెను పంపింది వరలక్ష్మి.

భ్రమరాంబ వెళ్లాక ఆలోచనలో పడింది వరలక్ష్మి. ఆమెలోని స్వార్థం బుసలు కొట్టింది. భ్రమరాంబ గొప్పది. వాళ్లకి పెద్ద పెద్ద షాపులున్నాయి. అటువంటి వాళ్లతో సాన్నిహిత్యం మంచిది ... అనుకుంది శత గింజవేసి తాటిగింజ లాగే స్వభావంగల వరలక్ష్మి.

తన భర్త యింకా నాలుగురోజుల వరకు రాడు. అయినా తను ఆలోచించుకుందుకు సాకుగా చెప్పింది

మర్నాడు తన అంగీకారాన్ని మాణిక్యంతో చెప్పి పంపింది. ఆ మరుసటి రోజు మంచిదనీ రెండుగంటల వేళ రిక్షా పంపమనీ కబురంపింది

ఆమె అన్న ప్రకారం మరుసటి రోజున భ్రమరాంబ పంపిన రిక్షాలో వెళ్లింది వరలక్ష్మి.

భ్రమరాంబగారింట్లో పాఠం చెబుతున్నట్లు తెలిసి, వాళ్ల బంధువులు, ఆ యిరుగు పొరుగువారు (అంతా ధనవంతులే) పెళ్లి కాకుండా యింట్లోవున్న తమ ఆడపిల్లలకు ప్రైవేట్లు చెప్పమన్నారు. అంతా యాభైరూపాయల చొప్పున యిస్తామన్నారు.

అంగీకరించింది వరలక్ష్మి...ఆరుపాఠాలు !... మూడువందల రూపాయలు నెలకు ...

భర్త వచ్చాక విషయం విని చాలా బాధ పడ్డాడు.

''నేను సంపాదిస్తున్నది తక్కువేం కాదు. కదా ? ... ఇంటి పట్టున సుఖంగా వుండి ఏ పుస్తకాలో చూసుకుంటూ విజ్ఞానాభివృద్ధి చేసుకుంటే నయం కదా ! ఎందుకు వచ్చిన శ్రమ ?'' అన్నాడు.

''అయ్యో ! పిల్లలుగలవాళ్లం. ఎలాగో అలాగ నాలుగు రాళ్లు సంపాదించుకుని నిలవ చేసుకోకపోతే ముందు ముందు చదువులు, పెళ్లిళ్లు అంటే ఎలాగ వస్తుంది డబ్బు ? వాళ్ల అభివృద్ధి మన దృష్టిలో పెట్టుకోవద్దా ?'' అంది.

ఏమీ అనలేక వూరుకున్నాడు శ్రీకాంత్.

రెండు నెలలు గడిచాయి.

పాఠాలన్నీ అయి వచ్చేసరికి పొద్దుపోయేది. ఆదరా బాదరా వచ్చి వండిపెట్టేది.

తల్లి వచ్చేవేళకు కాఫీ కాచి అట్టేపెట్టేవారు పిల్లలు. ఒక్కొక్కప్పుడు పెద్దపిల్లను బియ్యం కడిగి స్టౌ మీద పడెయ్యమనేది తల్లి.

''ఎక్కడికి వెడితే అక్కడ వేడి వేడి ఫలహారాలు, కాఫీలు యిస్తారు ... వద్దు మొర్రో మంటే వినరు'' అంటూ కళ్లు చక్రాల్లాగ తిప్పుతూ అడక్కపోయినా కనబడ్డవాళ్లందరితోటీ గొప్పలు చెప్పుకుంటుంది వరలక్ష్మి.

పాఠాలు ప్రారంభించి ఆరు మాసాలైంది ... పిల్లలపట్ల వెనకటి శ్రద్ధ లేదు. సుష్టైన భోజనం లేదు ... ఓ ఫలహారం లేదు వేళకింత వుడకేసి పడేసి వెళ్ళిపోయేది ప్రైవేట్లకి. ఆలనా పాలనా లేక చిక్కి సగమయ్యారు పిల్లలు.

''చూశారా ఈ నెక్లసు ? కంగన్‌హాల్లో కొన్నాను. గోల్డుకవరింగువి'' అంటూ చూపించింది భర్తకు.

''చిన్నప్పటినుండి రోల్డుగోల్డు వస్తువులన్నా, సినిమాలన్నా మహాపిచ్చి'' అని వరలక్ష్మి తల్లి అనడం గుర్తుకువచ్చి నవ్వుకున్నాడు శ్రీకాంత్.

ఏడాది గడిచింది.

కట్టిన చీర కట్టకుండా, పెట్టిన నగ పెట్టకుండా (రోజ్జుగోల్డువే) రోజూ ఒక కొత్త రకం అలంకరించుకుంటోంది. "ఎండాకొండా అనకుండా కష్టపడి సంపాదిస్తున్న సొమ్ము ఈ మాయనగలపాలు చేస్తున్నా"వని మందలించే వాడు.

"ఇదో పిచ్చి అనుకోండి" అని తేలికగా అతని మాటలు కొట్టేసి నవ్వేది.

* * *

"ఏమండీ, మేష్టరమ్మగారున్నారా?" అంటూ ప్రైవేట్ల వాళ్ల పనివాళ్లు వచ్చి అడిగారు అయిదారుగురు.

ఆనాడు ఆదివారం. పిల్లలు యింట్లోనే వున్నారు.

"ప్రైవేట్లు చెప్పడానికే వెళ్లారు" అన్నారు పిల్లలు.

"పదిరోజాల నుండి రావడంలేదు. ఊరికి వెడతానని చెప్పారట. వచ్చారేమో కనుక్కుందామని వచ్చాం" అన్నారు వచ్చినవాళ్ళు.

"ఎక్కడికి వెళ్లావమ్మామరి" అని అడిగారు తల్లి వచ్చాక.

"వాళ్ళ పిల్లలకి శ్రద్ధలేదు. తెలివితేటలంతకన్నా లేవు. అలాంటివాళ్లకి చెప్పినా మాట దక్కదనీ, పరీక్షలో ఫెయిలయితే నన్ను తిట్టుకుంటారనీ ఆ పాఠాలు మానేశాను వూరికి వెడుతున్నాననే వంకతో ... కొత్తగా ఇంజనీరుగారింట్లోను, ఓ లాయరుగారింట్లోను, ఓ జమీందారుగారింట్లోనూ చెబుతున్నాను. వాళ్లు చాలా తెలివైనవాళ్ళు. ఒక్కమారు చెబితే అందుకుపోతారు వాళ్లు ... ఈమారు ఎవరైనా వస్తే నేనెక్కడికి వెళ్లానో మీకు తెలియదని చెప్పండి" అని గట్టి కట్టడిచేసింది వరలక్ష్మి పిల్లల్ని.

పది పదిహేనురోజులు ప్రైవేట్లు వాళ్ళు వచ్చి తిరిగిపోతున్నారు.

ఎప్పుడూ తలుపు తాళం వేసి వుంటోంది. పిల్లలు స్కూళ్లకు వెళ్లిపోతారు. ఉన్నా, పెరటివైపు మసులుతారు. వీధివైపు తాళం వుంటుంది. అది వరలక్ష్మి బుద్ధి వైశద్యం.

ఇప్పుడు వరలక్ష్మి ఎవ్వరితోనూ మాట్లాడ్డం లేదు మునుపటిలాగ. తన హోదా పెరిగినట్లు ఆమె భావన ... ఆమె ప్రతికదలికలోనూ, మాటలోనూ వ్యక్తం అవుతోంది ఆ భావన.

* * *

"ఈ తెల్లరాడి వుంగరం చూశారా ఎంత బాగుందో" అంటూ తన వ్రేలి నున్న వుంగరం తీసి శ్రీకాంత్ చిటికెన వ్రేలుకి పెట్టింది.

పరిగ్గా సరిపోయింది అతని వ్రేలికి.

"ఎంత ?" అన్నాడు శ్రీకాంత్.

"పదిరూపాయలు" అంది వరలక్ష్మి.

"ఆఁ హాఁ" అన్నాడు నిర్లిప్తతగా.

మాయ వస్తువులకు వెదజల్లుతోంది సొమ్మంతా అనుకున్నాడు తనలో ... పైకి అన్నా ప్రయోజనం శూన్యం. పైగా, ఇటీవల ఆమె వెనకటి వలె సరదాగా తీసుకోడంలేదు. ముఖాన ప్రసన్నత లేదు.

"మిమ్మల్నేం తెమ్మనడంలేదు. మీ సొమ్మేం ఖర్చవడంలేదు. నా స్వార్జితంతో కొనుక్కున్నానివన్నీ, ఎందుకంత కోపం ? ... అమ్మ పెట్టా పెట్టదు ... అడుక్కు తినానివ్వదు అన్నట్లుంది మీ వరస" అని దులిపేస్తోంది. మనస్సులోని అక్కసంతా వెళ్ళగక్కుతోంది. కోపంతో తారాజువ్వలాగ యెగిరి పడుతోంది నోరెత్తితే ... తను సమాధానం చెప్పలేక కాదు వూరుకుంటున్నది. వరలక్ష్మి ఎంత మాటైనా అనడానికి జంకే మనిషికాదు ... మాటామాటా పెరిగితే నలుగురిలో







# ఆర్జన

నవ్వులపాలవడం తప్ప ప్రయోజనం శూన్యం. అందుకే శ్రీకాంత్ జవాబు చెప్పడం మానుకున్నాడు.

'మా అమ్మకి సుస్తీగా వుందని వుత్తరం వచ్చింది. మీరు పదిరోజులవరకు క్యాంపుకి వెళ్లరు గనక పిల్లల్ని చూస్తూ వుండండి. కాస్త తగ్గగానే వచ్చేస్తాను'' అంది వరలక్ష్మి భర్తతో.

తండ్రి వ్రాసిన వుత్తరం చూపించింది.

కన్నీళ్లు పెట్టుకుంది.

హైదరాబాదు బస్సు యెక్కించి వచ్చాడు శ్రీకాంత్.

వరలక్ష్మి వెళ్లి నాలుగు రోజులైంది.

పిల్లల్ని తను చూడలేక తల్లితో పంపివేశాడు శ్రీకాంత్.

* * *

''ఈ ఉంగరం కొత్తగా కొన్నావా? ఇదివరకు నీ చేతిని ఉంగరం చూడలేదే...'' అన్నాడు శ్రీకాంత్ మిత్రుడు నరసింహారావు. ఓ సాయంత్రంవేళ వాహ్యాళిగా వెడుతున్నారు మిత్రులిద్దరూ.

''ఇదీ ఓ ఉంగరమేనా? మా ఆవిడ పిచ్చి వ్యామోహం ... ఇది రోల్డుగోల్డుది. కంగన్‌హాల్లో వున్న వస్తువులన్నీ మా ఆవిడ కొన్నదన్నా అతిశయోక్తికాదు'' అన్నాడు శ్రీకాంత్ ఉంగరం తీసి మిత్రుని చేతికి యిస్తూ.

నరసింహారావు విశ్వబ్రాహ్మణుడు.

ఆ ఉంగరాన్ని పరిశీలనగా చూశాడు.

''నిన్ను మీ ఆవిడ టోకరా వేయించిందోయ్. బంగారంది అంటే అంత ఖర్చుపెట్టి యెందుకు కొన్నావని నువ్వు అనకుండా అబద్ధం చెప్పివుంటుంది. ఈ రాయి పుష్యరాగం. చాలా ఖరీదైంది'' అన్నాడు మిత్రుడు.

అతని మాటలు వేళాకోళంగా తీసిపారేశాడు శ్రీకాంత్. అయినా, ఇంటికి వచ్చాక అతని మాటలు శ్రీకాంత్ మనస్సులో పనిచేయడం ప్రారంభించాయి.

తనకు తెలిసిన ఒక షావుకారు ధగ్గరకు వెళ్లి ఉంగరం చూపించి ''ఈ బంగారం మంచిదేనా? మోసంలేదుగదా?'' అని అడిగాడు.

గీటురాయి మీద గీటు పెట్టాడు షావుకారు. రాయిని చాలాసేపు పరిశీలించాడు.

''దీనికేమండి. మేలిమిబంగారం — ఇలాంటి బంగారం ఇప్పుడెక్కడ వుందండి? రాయి పుష్యరాగంది ... మూడువందల పైమాటేగాని తక్కువకాదు. ఎవరికైనాసరే చూపించండి. ఈమాటే చెబుతారు.'' అన్నాడు షావుకారు.

దిమ్మెరపోయాడు శ్రీకాంత్.

శ్రీకాంత్‌లో చెలరేగిన ఆలోచనలు అతని మనస్సును చిందరవందర చేస్తున్నాయి. వరలక్ష్మి అర్థంకాని సమస్యగా తయారైంది. ఉన్నవిషయం తనతో చెప్పవచ్చునుకదా? అయితే ... ఇటీవల ఆమె ధరిస్తున్న నెక్లెసులు, గొలుసు, గాజులు, రకరకాల చెవి ఆభరణాలూ రోల్డుగోల్డువి కావా? అన్నీ బంగారంవేనా?

ఈవిధమైన ఆలోచనలతో యిల్లు చేరుకున్నాడు. నగలకోసం భార్య బట్టల బీరువా తెరిచాడు. బట్టల మధ్య ఒక అట్టపెట్టె వుంది. అందులో నగలన్నీ వున్నాయి. తల్లి సుస్తీ అని వెళ్లడంవల్ల కంగారుగా అన్నీ వదిలేసి వెళ్లివుండాలి ... బంగారంవి కాకపోతే యింత భద్రపరచవలసిన పనిలేదు అనుకుంటూ వాటన్నిటిని ఒక బ్యాగ్‌లో వేసుకుని తను ఉంగరం చూపించిన షావుకారు దగ్గరకే వెళ్లాడు శ్రీకాంత్.

''వీటి నాణెంకూడా చూడు'' అన్నాడు.

'మంచివేనండి ... సరికొత్తగా వున్నాయి. చేయించినవా? కొన్నవా?'' అడిగాడు షావుకారు.

''కొన్నవే ... ఏం అలా అడుగుతున్నావు?''

''చేయించినవే అయితే మీకు సందేహం వుండదుకదా? కొన్నవేమో అనిపించి అడిగానండి'' అన్నాడు షావుకారు.

''ఎంతైనా షావుకారు బుర్ర షావుకారు బుర్రే! ఇవి కొన్న నగలే'' అన్నాడు శ్రీకాంత్ అతన్ని మెచ్చుకుంటూ.

''నిజమే ... ఇదిగో, కె. యల్. అని వీటిమీద గుర్తు చూశారా? సేట్ కాంతిలాల్ కంపెనీవన్న మాట. అక్కడ తయారైనవి. మంచి నాణ్యమైన సరుకు తయారుచేస్తారు వాళ్లు'' అన్నాడు షావుకారు.

**గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది గేయాలు తిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.**

సేట్ నగల షాపులోనికి వెళ్లాడు శ్రీకాంత్.

''సేట్‌జీ ... ఈ నగలు చూడండి ... మీ షాపులో తయారైనవేనా?'' అని నగలను చూపించి అడిగాడు శ్రీకాంత్

ఒక్కొక్క వస్తువునేతీసి పరిశీలనగా చూశాడు సేట్.

''ఇవి ఇక్కడ తయారైనవే. ప్రతీ వస్తువు మీదా మా కంపెనీ గుర్తు వుంది చూడండి'' అన్నాడు గుమస్తా.

''ఎప్పుడెప్పుడు ఏ నగ ఎంతకి అమ్మారో చెప్పగలరా?'' అడిగాడు శ్రీకాంత్.

''అసలు ఈ నగలు మీదగ్గర యెందుకున్నాయి?'' సందేహాస్పదంగా అడిగాడు గుమాస్తా.

''ఇవి నా భార్య నగలు. ఆమె కొనుక్కున్నవి'' అన్నాడు శ్రీకాంత్.

''అదేమిటండీ ... ఇవి ఇంజనీరు సుదర్శనం గారు, జమీందారు లక్ష్మీజీరావుగారు ... ఇంకా .. ఎవరు చెప్మా ... గుర్తురావడంలేదు. ఆఁ ... ఆఁ ... తెల్లగా పొడవుగా వుంటాడు. నల్లకోటు. అదే... లాయరు వెంకటాచలంగారు...కొన్నారు... ఇవిగో పద్దులు చూడండి...'' అంటూ బిల్లుల పుస్తకం తెచ్చాడు గుమాస్తా.

ఒక్కొక్క నగ ధర, కొన్న తేదీ, సొమ్ము చెల్లించినవారి సంతకం కార్బన్ కాపీలు వున్నాయి.

''ఏమిటి సంగతి?'' అన్నట్టు సేట్ కనుబొమలు ముడివడ్డాయి

గుమాస్తా తలవంచుకుని ముసిముసిగా నవ్వాడు ''ఆ మధ్యజమీందారుగారితో సిల్కుపేలస్‌లో చీరలు కొంటున్న ఒకావిడను చూపించానే మీకు ... ఆవిడ ఇంజనీరుగారి అమ్మాయిలకు, జమీందారు గారి చెల్లెలికి, లాయరుగారి మేనగోడలికి ట్యూషన్లు చెబుతుంది. ఆవిడ భర్త ఈయన పాపం ...'

గుమాస్తా సేట్‌తో అంటున్న మాటలూ, వారి నవ్వులూ షాపుమెట్లు దిగి బైటకు వస్తున్న శ్రీకాంత్ చెవులో పడ్డాయి.

రిక్షాలో ఇంటికి బైలుదేరాడు ... అతని మనస్సు మనస్సులో లేదు ... రోడ్డుమీద నడిచే జనం, వచ్చే పోయే వాహనాలు, షాపులు, మేడలు అతని కళ్ల యెదుట గిర్రున తిరుగుతున్నాయి. ప్రపంచమే అతనిచుట్టూ పరిభ్రమిస్తున్నట్లుంది. రేడియోలలో నుండి, లౌడ్ స్పీకర్లలో నుండి వినబడే పాటలుగాని, జన సందోహం చెప్పుకునే కబుర్లుగాని, వాహనాల చప్పుళ్లుగాని అతని చెవులకు సోకడంలేదు. అతని జ్ఞానేంద్రియాలు పనిచేయడం మానివేశాయి.

వడివడిగాయింటికి చేరుకున్నాడు. చేతిలోని వస్తువుల బ్యాగ్ సావిట్లో దూరంగా గిరవాటు వేశాడు మూలకి. ఉరమకుండా పిడుగునెత్తిన పడితే ... భూమి బద్దలై తనను లోనికి లాక్కుంటే ... ఎంతబాగుణ్ణు ... ఇక ఆలోచించ లేకపోయాడు ... అతని మెదడు మొద్దుబారి పోయింది ... శరీరం వశం తప్పిపోయినట్లనిపిస్తోంది.

తలయెత్తి చూశాడు.

హాల్లో యెదురుగా తనదీ, వరలక్ష్మిదీ ఫొటోలు ఎన్‌లార్జి చేయించి తగిలించినవి కనబడ్డాయి. గోడమీద ఫొటోలోని వరలక్ష్మి ముఖం నల్లగా అలుక్కుపోయి, పిశాచంలాగకనబడుతోంది.

శ్రీకాంత్ ఒళ్లు వేడెక్కింది. కోపంతో ముఖం, కళ్లు యెర్రబడ్డాయి. పళ్లు పటపట కొరుకుతూ పక్కనున్న కుర్చీలాక్కుని ఎక్కి వరలక్ష్మి ఫొటోతీసి, బలంగా నేలకు వేసి కొట్టాడు. ... ''పిశాచీ ... నీకిదే తగిన శిక్ష'' అంటూ.

* * *

''పరంధామయ్యగారూ! పోస్ట్'' అంటూ వరలక్ష్మి తండ్రి పరంధామయ్యగారి చేతికి ఒక కవరిచ్చి వెళ్లిపోయాడు పోస్ట్‌మన్.

ఆ జాబు చదువుతున్న పరంధామయ్యగారి ముఖం వివర్ణమైపోయింది. ఆ జాబులోని విషయం—

''పరంధామయ్యగారికి :

మీ అమ్మాయి నీచ ప్రవర్తనవల్ల నలుగురిలోనూ తలయెత్తుకోలేని పరిస్థితిలో పడ్డాను. తెలిసినవారు ఎవరూ కనబడని దూరప్రాంతానికి వెళ్లిపోతున్నాను. నాకోసం వెదికించే వ్యర్థ ప్రయత్నం చెయ్యవద్దు... శ్రీకాంత్.''

# వారఫలం

**9-3-1979 శుక్రవారం మొదలు**
**15-3-1979 గురువారం వరకు**

**మేషం :** స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ఋతర్వుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృషభం :** వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో కొంగవాటాలు తగవు. బంధువులకు సహాయం చేస్తారు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిథునం :** రావలసిన డబ్బు అందుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం :** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ఆర్థికవ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభించ గలవు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. విలాస వస్తువులు కొంటారు.

**కన్య :** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. వారం ఆఖరులో ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**తుల :** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**వృశ్చికం :** నూతన వ్యవహారాలు లాభిస్తాయి. అనుకూలమైన వార్తలను వింటారు. వృత్తిలో ముఖ్యమైన వార్తలను వింటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— దైవ కార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :** వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మకరం :** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయంచేస్తారు.

**కుంభం :** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. సాటి వారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మీనం :** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

— మహేష్ ●

---

ఎందుకో జన సందోహం తగ్గింది.

దగ్గర్లో ఎవరూ లేరు, వసంతా వాళ్లు తప్ప.

కొద్దిగా నిద్రవస్తున్నట్టనిపించింది.

మొహం మీద కర్చీఫ్ వేసుకు గడ్డిలో పడుకున్నాడు.

హఠాత్తుగా ఏదో కలకలం.

"ఏమండీ! ఏమండీ!" ఆదుర్దాగా వసంత గొంతు.

చటుక్కున లేచి కూర్చుని చూశాడు.

వసంత గజ గజ వణుకుతూ పిల్చింది.

నిజంగానే! వసంతే! ఫాంటసీ కాదు.

నిశ్చేష్టుడయ్యాడు.

నిజాన్ని నమ్మబుద్ధెయ్యటం లేదు.

## వసంతా నీ పేరేమిటి?

(14 వ పేజీ తరువాయి)

చిన్నప్పట్నుంచీ మైన మైనాలుగా కలలు కన్న దృశ్యం ఇది.

ఇవాళ నిజంగా ...

"తమ్ముడు నీళ్ళలో పడిపోయాడు. మీరు దూకి ఎలాగైనా రక్షించాలి. ప్లీజ్! ప్లీజ్! ప్లీజ్!"

ఇద్దరాడవాళ్లు గొల్లున ఏడుస్తున్నారు. వసంతకి కళ్లెంబడి నీళ్లు కారిపోతున్నాయ్. పెద్ద కుర్రాడు వెక్కెక్కి ఏడుస్తున్నాడు.

ఇదంతా నిజం. నిజంగా జరుగుతోంది. తను సతతం కోరుకుంటున్నది ఇవాళ జరుగుతోంది.

ఇంక ఆలోచించ లేదు. పరుగెత్తి నీళ్ళలోకి దూకాడు. వక్రంగా, ఇబ్బందిగా ఈత చేతకాని వాడు దూకినట్టు.

అతను దూకలేదు. పడ్డాడు.

నిజమే! అతనికి ఈత రాదు.

అందుకని ఇన్నాళ్ళనుంచి తీరని కోరిక ఇప్పుడు తీరబోతుంటే వదులుకుంటాడా. అందమైన అమ్మాయి దూకమంది—

తను దూకాడు.

చాలు.

'ఇంతకీ ఆ వసంత పేరేమిటో?' ప్రాణం పోయేముందు చివరి ఆలోచన.

"వసంతా! నీ పేరేమిటి?" అంటూ అలజడిగా చెదిరిపోతున్నాయ్ అలలు. ●

## టి.ఎస్. ఆర్. ఎస్ – పెదవేగి

నా వయస్సు 22 సంవత్సరములు. వివాహమై 6 సంవత్సరములు అయినది. నాకు కాళ్ళు చేతులు లాగుట, నడుమునొప్పి, నీరుడు అధికముగా అగుట జరుగుతోంది. రాత్రులందు నిద్ర పట్టదు. నీరసముగాను, గుండెనొప్పిగాను వుంటుంది. కడుపు నొప్పి గూడా వుంటుంది. ఈ లక్షణములకు ఏమి మందు వాడవలెను?

మీరు వ్రాసిన లక్షణాలను పరిశీలిస్తే రక్తంలోని హిమోగ్లోబిన్ అనే 'ఇనుపధాతువు' లోపించి వుండటంవల్ల దాగల 'అనీమియా' అనే రోగం మీకు వున్నదని తోస్తున్నది. శరీరావయవాలు సరిగ్గా పనిచేయుటానికి ఆ అవయవాలలోని జీవకణాల (సెల్స్) కు ఆహారం, ఆక్సిజన్ అనే రెండూ చాలా అవసరం. ఈ రెండు కలిసి ఆహారంలోని 'సత్తువ'ను దహింప చేయుటం వలననే ఆ అవయవాలకు 'శక్తి' అనేది ఏర్పడుతుంది. ఈ రెండింటిలో ఏది లోపించినా మీరు వ్రాసిన లక్షణాలు ఏర్పడే అవకాశం వుంది. రక్త పరీక్ష చేయించుకుంటే నెత్తురులోని హిమోగ్లోబిన్ ప్రమాదం తెలుస్తుంది. మామూలుగా స్త్రీలకు 14.5 గ్రాములు, పురుషులకు 15.0 గ్రాములు అనే తీరులో ఈ హిమోగ్లోబిన్ వుంటుంది.

## కె. పి. జి – పెద్దాడ

నా పళ్ళు శుభ్రముగా వుంటాయి. కాని చెడువాసన వస్తుంది. పళ్ళ డాక్టర్ పళ్ళలో ఏమీ లోపము లేదన్నారు. శ్వాసకోశములోనో, జీర్ణాశయములోనో ఏమైనా లోపము వున్నదా? దీనికి ఏమైనా మందులు వాడాలా?

పళ్ళు పరిశుభ్రంగా వున్నాయని, దంతవైద్యులు చెబితే ఆ దుర్వాసన దంత సంబంధమైనది కాదని తెలుస్తూనే వున్నదిగా.

మీరు వ్రాసినట్లుగా శ్వాసకోశంలో చీము వంటి కఫం పేరుకొని వున్నా (లంగ్ ఆబ్సెస్, ఎంఫయిజామా బ్రాంకి యెక్టేసిస్) జీర్ణాశయంలో కొన్ని జీర్ణధాతువులు లోపించగా తద్వారా ఆహారం సరిగ్గా జీర్ణంకాక, పిత్తరసం ప్రభావం వల్ల ఇలా చెడువాసన మాట్లాడినప్పుడు రావటం జరుగుతుంది.

వైద్యపరీక్షవల్ల ఎందు వల్ల అయిందీ తెలుసుకొని, దానికి తగిన చర్యలు తీసుకుంటే మంచిది. అంతవరకూ నోటిని, లిస్టరిన్, డెట్టాల్ మొదలయిన వాటితో 2, 3 సార్లైనా ప్రతిరోజూ శుభ్రపరచడం మంచిది.

## పి. హెచ్. వై – కలకత్తా

నాకు ఒక సంవత్సరము నుండి రెండు పెదిమల చివరలలో తెల్లగా వున్నది. మల పరీక్షలో వర్మ్స్ వున్నాయన్నారు. వాటికి మందులు వాడాను. కాని పెదిమల చివర తెలుపు పోలేదు.

పెదిమలు తెల్లగా వున్నాయంటే పాలిపోయి వున్నాయంటే పాలిపోయి వుండటం అనే అనుకొని ఈ సమాధానం వ్రాయటం జరుగుతున్నది. పొడలలాగా లేక బొబ్బలాగా అయితే ఈ జవాబు వర్తించదు.

మలపరీక్షలో క్రిములు వున్నాయని తెలిసిన తర్వాత మందులు వాడి నయమవుతుందని ధీమాగా వుండటం పొరపాటు. తిరిగి మలపరీక్ష చేయించుకొని ఆ క్రిములు పోయినవా లేదో నిర్ధారణ చేసుకోవటం చాలా అవశ్యం. 'హుక్‌వర్మ్' వల్ల నెత్తురులేమి (అనీమియా) ఏర్పడి చర్మం తెల్లగా పాలిపోయినట్లవుతుంది. ఫెర్సొలేట్ కాప్సూలిట్ మొదలైన మాత్రలు రోజుకి 2 పంతున ఆహారానికి తర్వాత వాడటం మంచిది.






## వి. ఎస్. బి – కొత్తపేట

జ్ఞాపకశక్తికి మందులు లేవన్నారు. తెలివితేటలు కూడా అంతేనా? లేక ఆహారంపై ఆధారపడి వుంటుందా? శారీరక ఆరోగ్యానికి, జ్ఞాపకశక్తి, తెలివితేటలకూ సంబంధమువున్నదా?

జ్ఞాపకశక్తి అంటే ఆంగ్లంలో మెమోరీ అనేది, గర్భధారణ సమయం నుంచి, దాదాపు వయస్సు మీరేవరకూ (సుమారు 45 సం.లు) పెరుగగలదు. లేక రాగల పరిణామాల మీద ఆధారపడి వుంటుంది.

ఈ విషయంపై ఎన్నో పరిశోధనలు ఆధునిక వైజ్ఞానిక శాస్త్రరీత్యాను, మన సనాతన ఆయుర్వేద రీత్యాను జరపబడ్డాయి, ఇంకా జరుగుతునే వున్నాయి.

ప్రస్తుతం జ్ఞాపకశక్తి అనేది శిశువు తల్లి గర్భంలో ఏర్పడే సమయంలోనే నిర్ణయింపబడుతుందని శాస్త్రజ్ఞుల అంచనా.

జ్ఞాపకశక్తి లేకపోతే తెలివితేటలు ఎలా వుంటాయి? 'మండూక పర్ణి' అనే ఆయుర్వేద శాస్త్ర సమ్మతమైన (ఆకులు, చెట్టు సమూలంగా) మందు దీనికి పనిచేస్తుందని కొంతవరకూ నిరూపించబడింది.

## పి. ఎమ్ – కర్నూలు

కొంతమందికి కొన్ని ఇంజక్షన్లు చేస్తే, చేసినచోట గడ్డలు కడతాయి. ఎందు వలన? లోపం మందుదా? రోగి శరీరతత్వమా? లేక మందు ఇవ్వబడిన విధంలో తేడా వల్లనా?

ఇంజక్షన్లు చేసిన చోట గడ్డలుగా ఏర్పడటం వాడబడిన మందుమీద ముఖ్యంగా ఆధారపడి వుంటుంది. కాని మీరు వ్రాసినట్లు మిగతా రెండు కారణాలు కూడా కొంతవరకు కారణాలవటం సహజంగా జరిగేదే. కాని ఒక విషయం ముందుగా గుర్తుంచుకోవాలి. ఎవరూ కూడా కావాలని కొత్తగా ఏదో రోగాన్ని తీసుకువస్తారని అనుకోవటం పొరపాటు. ఇంజక్షన్ ఇవ్వగానే ఆచోట బాగా రుద్దడం, వాపు ఏర్పడితే వెంటనే వేడినీళ్ళ కాపుపెట్టటం చాలా అవసరం.

## పి. ఎస్. కె – విజయవాడ

నా వయస్సు 18 సం.లు. తల వెంట్రుకలు పొడుగ్గా పెరుగునని కొన్ని ప్రకటనలు చూచి, కొన్ని మందులు వాడాను. 2, 3 నెలలు వాడిన తర్వాత వెంట్రుకలు పెరుగుటకు బదులు వూడి పోవుచున్నవి. ఇలా ఎందుకు జరుగుతుంది.

పత్రికాప్రకటనలు వ్యాపార దృష్ట్యా చేయబడతాయనితెలియనిఅమాయకులు మనదేశంలోనూటికి 90 నుండి వున్నారు. కనుకనే ఇన్ని మందుల సంస్థలు, ఏజన్సీలు మన దేశంలో పెరిగిపోయినాయి. ఏదైనా, దానిని గురించి పూర్తివివరాలు చదివి, స్వయానా ఇతరులు లాభం పొందటం చూచి తృప్తిచెందిన తర్వాత మీరు కూడా వాడటం మంచిది.

—డా॥ కె. వెంకటేశ్వరరావు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# హైదరాబాద్ నోట్ బుక్

తిరుమల రామచంద్ర

**అధికారభాషా సంవత్సరం ప్రారంభోత్సవం :**

మహిళా సంవత్సరం. బాలల సంవత్సరం లాగే రాష్ట్ర ప్రభుత్వం తెలుగును అధికార భాషగా చేసే కృషి ముమ్మరంగా కొనసాగించడానికి జనవరి 26 న రిపబ్లిక్ దినోత్సవం నుండి వచ్చే రిపబ్లిక్ దినోత్సవం దాకా సంవత్సరం పాటు అధికారభాషా సంవత్సరంగా పాటించదలచి, రిపబ్లిక్ దినోత్సవాల జూబిలీ హాలులో ప్రారంభోత్సవం చేశారు. విద్యా మంత్రి శ్రీ భవనం వెంకటరామరెడ్డి అధ్యక్షత వహించగా, ముఖ్య మంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. అధికార భాషా కమిషన్ అధ్యక్షులు వందేమాతరం రామచంద్రరావు ముఖ్య అతిథిగా ఉన్నారు. ప్రభుత్వ సంయుక్త కార్యదర్శి శ్రీ మాణిక్యాలరావు స్వాగతం చెప్పారు. తెలుగును అధికార భాష చేయడానికి ముఖ్య మంత్రి ఎంతో కృషి చేస్తున్నారని, న్యాయస్థానాలలో తెలుగులో తీర్పులు వ్రాయడం వచ్చే వరకు, వకీళ్ళ వాద ప్రతి వాదాలు తెలుగులో జరిగి, పామరులయినవారికి అర్థమయ్యే వరకు తెలుగు అధికారభాష అయినట్టు కాదని శ్రీ వెంకటరామరెడ్డి అన్నారు. భాషా ప్రయుక్త రాష్ట్రాలు తెలుగువారి గురుతర త్యాగంతో ఏర్పడ్డాయని, తెలుగు అమలు అవుతున్నదా లేదా పరిశీలించడానికి ప్రత్యేకాధికారిని నియమిస్తామని, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ బి. జె. నాయుడు అన్నారు. ఆస్థానకవి డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు ప్రసంగిస్తూ, మనం ముఖ్యాంశాలు వదలి, చిన్న వాటి కోసం పోట్లాడుతున్నామని అంటూ రథం అనే పదం స్త్రీ లింగమా, పుంలింగమా అని ఉరుదూ విద్వాంసులు వాదులాడుకున్నప్పుడు స్త్రీలు ఎక్కి వస్తే స్త్రీలింగం, పురుషులు ఎక్కి వస్తే పుంలింగం అని మహాకవి గాలిబ్ చలోక్తిగా అన్న కథను ఉదాహరించి, జనం భాషను మల్చుకుంటారని అన్నారు. వందేమాతరం రామచంద్రరావు ప్రసంగిస్తూ, స్వాతంత్ర్యం సిద్ధించి 32 సంవత్సరాలయినా ఇంగ్లీషును మనం వదల లేకపోవడం శోచనీయమన్నారు. మూడు సంవత్సరాలలో రాష్ట్ర స్థాయిలో అధికార భాషను అమలు పరుస్తామని అన్నారు. ముఖ్యమంత్రి అధికార భాషా జ్యోతిని వెలిగించి సంవత్సరానికి ప్రారంభోత్సవం చేస్తూ, దేశం స్వతంత్రం రావడంతో దేశ భాషలకు ప్రాధాన్యం వచ్చిందని, కింది స్థాయిలో భాషకు ఉపయోగం లేకపోతే భాష పెరగదని అనుదిన జీవితంలో వినియోగపడినప్పుడే భాష పెరుగుతుందని అన్నారు. ప్రభుత్వ ఉత్తర్వులు పై నుంచి క్రిందికి పోయేప్పుడు, తెలుగులోనే పోయేట్టు చూస్తామని, జనాన్ని గౌరవించడానికి పూనుకోవాలని అన్నారు. హిందీ విషయం ఆయన ప్రస్తావించి, దేనినయినా ప్రేమతో అమలు పరచాలి గాని పంతంతో కాదని హెచ్చరించారు. ఒక భాష బిగబట్టుకొని నడిస్తే అభివృద్ధి కాదని అన్నారు. ప్రభుత్వ అనువాదకులు, అధికార భాషా కమిషన్ కార్యదర్శి శ్రీ గోవిందరాజు రామకృష్ణారావు ధన్యవాదాలు చెప్పారు.

**బుద్ధుని సాహిత్య నిర్వచనాలు :**

మన భారతీయ సాహిత్య శాస్త్రం భరతుని నుంచో భామహుని నుంచో మొదలయిందని ఇంత వరకూ నమ్ముతున్నాము. ధ్వని సిద్ధాంతం ఆవల వచ్చిందనీ విశ్వసిస్తున్నాము. కాని, నీటికంతా మూలాలు బుద్ధుని కాలానికే ఉన్నాయని, బుద్ధుడు కవులను వారి రచనలను ఆధునికులు కూడ ఆశ్చర్యపడేవిధంగా నిర్వచించాడని తెలిస్తే ఆశ్చర్యంగావుంటుంది ఎవరికయినా. ఇలా ఆశ్చర్యపడేట్టు చేశారు ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృతశాఖ రీడరు, విశ్వవిద్యాలయం ఆర్ట్సు కళాశాల వైస్ ప్రిన్సిపాలు డాక్టర్ ప్రమోద్.జి.లాల్యే, ఫిబ్రవరి 4వ తేదీ సాయంకాలం ప్రాకృత అకాడెమీ (16, తుల్జాగూడ, హైదరాబాద్—1) "బవుద్ధ" జైన ఆలంకారిక సిద్ధాంతాలు అనే విషయంపై ప్రసంగిస్తూ, బుద్ధుని ఉపదేశాల సర్వస్వం త్రిపిటకాలు. ఆయన మాట్లాడినది ప్రతిదీ త్రిపిటకాలలో సంకలితమైనది. తర్వాత వాటికి వ్యాఖ్యానాలు, టీకలు బయలుదేరాయి. డాక్టర్ లాల్యే బౌద్ధాలంకారిక విషయాలనుగురించి చెప్పిన విషయాల సారాంశమిది—బుద్ధుడు కవులను నాలుగు విధాలుగా చెప్పినట్టు కవిసుత్తంలో ఉంది. వారు నలుగురు—చింతాకవి, సుత్తకవి, అర్థకవి, ప్రతిభానకవి. చింతాకవి ఆలోచించవలసే కవితలల్లేవాడు. సుత్తకవి సూత్రీకరించేవాడు. అర్థ కవి అర్థానికి ప్రాధాన్యమిచ్చేవాడు. ప్రతిభానకవి ప్రతిభతో రచించేవాడు. (దీనిని చూచే కాబోలు రాజశేఖరుడు తనకావ్య మీమాంసలో శాస్త్రకవి, కావ్యకవి అని కవులను రెండు విధాలుగాచెప్పాడు). ప్రతిభాన

మంటే, ప్రకారం, అవగాహనం ఉండేవాడు. పిటకాలకు వ్యాఖ్యచేసిన సంగీశుడనే ఆచార్యుడు బుద్ధుణ్ణి కావ్యవిత్తు, కావ్యమిత్ర, ప్రతిభావతాం అగ్ర — ప్రతిభావంతులలో అగ్రేసరుడు— అని ప్రశంసించారు.

మిళిందపన్హలో బుద్ధోపదేశాలు శైలీదృష్టితో అర్థప్రధానమన్నారు. వేదంలో మంత్రానికి, శబ్దానికి ప్రాధాన్యం. పదాల అన్వయం సరిగా వుండాలని బుద్ధుడు అన్నట్లు అంగుత్తర నికాయంలో వుంది. సార్థ, సవ్యంజనగా భాష వుండాలి. అర్థం నీతార్థం నేయార్థం అని రెండు విధాలు. నీతార్థమంటే సిద్ధార్థం, రూఢార్థం. నేయార్థమంటే సాధ్యం ఊహించదగింది. ఉపదేశకుడు నీతార్థమే చెప్పాలి గాని, నేయార్థానికి పోరాదు. ఉపదేశం పర్యాయ భాషితం—వివరణగలది, సంధాయభాషితం—సందర్భం గలది స్వభావభాషితం సహజమైనది. దీర్ఘ నికాయంలో బుద్ధుని భాష సరసంగా వుండేది కాదని, వేళ (సుందరం) కర్ణసుఖ, ప్రేమించదగింది. హృదయంగమ, ప్రసర బహుజనకాంతిగా వుండేదట. అధివచనం — భావాతీత వచనం — —కంచుకం పులకింపచేసేది, ప్రియరూపం, స్వేద రూపం అని, అధివచనాలు దృష్టి దీపకాలు — దృష్టిని విశాలం చేసేవని అన్నాడు బుద్ధుడు. రసాలలో ప్రవివేకరసం, ధమ్మనీతి రసం ఉత్తమాలు చెప్పాడు. వ్యాఖ్యాతలు రసమంటే ఆస్వాదమన్నారు. తృష్ణాక్షయం ముక్తిరసానికి మూలం శాంతరసాన్ని కూడ చెప్పారు. ఉపమానమంటే ఉదాహరణం, తర్వాత డాక్టర్ లాల్వే జైనాలంకారికులను వివరిస్తూ హేమచంద్రుడు శబ్దాలంకారాలను, అష్టాదశ లోన్ని, ఋతువర్ణనలను ఖండించాడని, ఉదాహరించాడని అన్నారు. కావ్యం మహాకాయం సుకుమారమతులను పురుషార్థాలలో ప్రవర్తింప చేసేది, కవిశక్తి ఖ్యాపనపరం అని, కనుక అష్టాదశవర్ణనలు వ్యర్థమని అన్నాడని అన్నారు. హేమచంద్రుడు కొన్ని అలంకారాలను తీసివేశాడు. హేమచంద్రుని శిష్యులైన రామచంద్ర గుణచంద్రులు నాట్యదర్పణంలో నాటకాన్ని చర్చించారు. అన్ని రసాలు ఆనందకరం కావని, భావాన్ని బట్టి హార్యతం ... అని, విప్రలంభశృంగారంలో ఆశాబంధం వుంది గనుక ఆనందకరమని, అన్నారు. ఆకలి, దప్పిరసం కావచ్చు. శంఠం ... కాని, రసం కాదు. పిదప లాల్వే 29 మంది జైనాలంకారికుల సంప్రదాయాలను వివరించారు. తర్వాత జరిగిన చర్చలో డాక్టర్ కె. కమలమ్మ, డాక్టర్ జి. ధర్మారావు, శ్రీ రవ్వ శ్రీహరి, శ్రీ కె. రఘుపతిరావు పాల్గొన్నారు. ప్రారంభంలో ప్రాకృత అకాడెమీ అధ్యక్షుడు శ్రీ తిరుమల రామచంద్ర స్వాగతం పలుకుతూ అకాడెమీ ఉద్దేశాలు వివరించారు. అకాడెమీ సంయుక్త కార్యదర్శి శ్రీ కృష్ణఫణి వందనసమర్పణతో సమావేశం సమాప్తమయింది. సమున్నతమైన అద్భుతమైన పరిశోధన ప్రసంగం చేసినందుకు డాక్టర్ లాల్వేను శ్రోతలు అభినందించారు.

ఉపశ్రుతి:

"మా సమావేశం సమాప్తమయ్యే వరకు ఓపికతో కూర్చున్నందుకు ధన్యవాదాలండీ!" అన్నారు ఒకసభలో నిర్వాహకులు ప్రముఖ రచయిత శ్రీ హరిశ్చంద్ర ప్రసాద్‌ను. "స్వామీ, సమావేశం కోసం నేను కూర్చోలేదు. సమావేశం ప్రారంభించిన పెద్ద మనిషి ఈ వస్తువులభారం నాకు అప్పగించి వెళ్లారు. ఆయన ఎప్పుడెప్పుడు వేదిక దిగుతారా, అప్పగించి వెళ్దామా అని చూస్తున్నాను'" అన్నారు హరిశ్చంద్రప్రసాద్

"ఎంత?"

"పది పైసలు."

"అంతకు తక్కువ లేదా?"

"లేదు బాబూ."

"బోడి ఉంగటం కుట్టినందుకే పది పైసలా?!"

కొండ శిఖరంలాంటి తేరు. తేరు నీడలో చిట్టెలుకలా వీరముని. అతని ముందు మదపుటేనుగులా లావుపాటి పెద్దమనిషి.




"ఉంగటం చిన్నదే. కాని ఉంగటం వూడిపోతే చెప్పు కాలికి రాదు" వీరముని నోరు విప్పాడు. 'రథ చక్రాలు చిన్నవే. చక్రాలు సరిగాలేని రథం కదలదు' అనాలనుకొన్నాడు. కాని, అనలేకపోయాడు.

"ఊ, మాటలు మహా నేర్చావులావుంది" గుడ్లురిమి చూసి, సిల్కు జుబ్బా జేబులోంచి పర్సు తీసాడు పెద్దమనిషి.

"మా పొట్టకూడు దొరకొద్దా బాబూ" స్వరం తగ్గించాడు వీరముని. గొంతుక్కూర్చొని చేతులు రెండూ చాపాడు, వెనక్కాళ్ళమీద నిలబడి ముందరి కాళ్ళు పైకెత్తి ఆతురతగా చూస్తున్న చిట్టెలుకలా. పెద్దమనిషి గొంగళిపురుగును చూసినట్టు చూసి పది పైసలు విసిరి, విసవిసా నడిచాడు. చీపురులా చెత్త వూడ్చుకొంటున్న ఖద్దరు ధోవతి కొంగును సరిచేసికొంటూ గొణుక్కుంటూ వెళ్ళాడు. పది పైసలు నేలబడింది. వీరముని మహా ప్రసాదంలా పది పైసలు అందుకొని కళ్ళకద్దుకొన్నాడు. ఆరికేసి తగ్గాడు. [illegible] పైసలు పసిగట్టిన వీరముని పెద్దకొడుకు బేలగా చేయి చాపాడు. కోపంగా అపరాధిని చూసినట్లు చూశాడు వీరముని. పిల్లవాడు ముఖం మాడ్చుకొన్నాడు. వీరముని పది పైసలు గోతం పట్టక్రిందవేసి మూశాడు.

"పాలిష్ చేస్తావా?"

"చేస్తాను బాబూ."

"బాగా చేయగలవా?"

"ఆఁ"

బూటుకాలు ముందు జరిపాడు విద్యార్థి. బూట్లను కప్పేలా 'బెల్ బాటం' ప్యాంటు, చెవులు కప్పడకుండా కప్పిన జుట్టు. వెనుకటి రాజకుమారుని వేషం నేటి విద్యార్థి ఫాషన్. బూటు మట్టి దులిపాడు వీరముని. 'పాలిష్' మూత మార్చి రాశాడు. బ్రష్‌తో పది నిమిషాలు రుద్దాడు. చేతులు నచ్చుకపోయాయి. ఆపేశాడు.

"ఎంత?"

"ఇరవై పైసలు"

"ఇరవై?!"

"అవును బాబు, మంచి పాలిష్ బాగానే చేసాను. బూటు అందం పాలిష్ బాగా ఉంటేనే. పై మెరుగులు, అలంకారం బాగా వుంటేనే తేరుకు అందం."

"తీసుకో."

ఇష్టంలేని దాసం బలవంతం మీద చేస్తున్నట్లు ఇరవై పైసలు గిరాటేసి గిరుక్కున తిరిగాడు హిప్పీ అబ్బాయి. రీవిగా పడిచాడు, దర్పం దివిటీలా ముఖంలో వెలిగింది,

వీరముని పైసలు దాచాడు. వీరముని చిన్నకొడుకు నిద్రలేస్తూనే ఏడుపు మొదలు పెట్టాడు. తల్లి పిల్లవాడిని ఒడిలో చేర్చి తట్టుతూ కూచుంది. నీరెండ సూటిగా ఉంది. తేరు నీడనుతరుముకొస్తున్నట్లుంది. వీరముని గోతం పట్టను నీడలోకి జరుపుకొంటూ కొత్తబేరం కోసం వేయి కళ్ళతో ఎదురు చూశాడు. అతని భార్య మునెమ్మ దీనవదనంతో గూడు కట్టుకొన్న వేదనతో పిల్లవాడిని సముదాయించటంతో సతమత మవుతూ వుంది.

మిట్ట మధ్యాహ్నం అయింది. నీడ మాయమయింది. ఎండ నిప్పులు చెరుగుతూ వుంది. వీరముని కళ్ళు తిరిగేలా వుంటే తేరు క్రిందుగా జరిగాడు. పిల్లలు సొమ్మసిల్లి పడివున్నారు. ప్రక్కనే వున్న పన్నీరు లాంటి కోనేటి నీటిలో ముఖం కడుక్కొనివచ్చి పిల్లలను లేపాడు. ముఖాలు కడిగాడు. దగ్గరలోనే వున్న దోసలమ్మే మునలమ్మ దగ్గరకెళ్ళి మూడు దోసెలు తెచ్చాడు. దోసెలు సత్తు గిన్నెలో పిల్లల ముందు పెట్టాడు. పిల్లలు వాసన మిగలకుండా నాకేశారు గిన్నెను. మిగతగా వుంటే నడుం వాల్చాడు వీరముని. మునెమ్మ గిన్నె కడిగింది. కోనేటి నీటిని ముంతతో తెచ్చి పిల్లలకు తాపించింది. మూర్ఛనుండి మేల్కొన్నట్లు కళ కళలాడాయి పిల్లల ముఖాలు. రద్దీగా వున్న వీదిని వింతగా చూస్తూ నిలుచున్నారు. మునెమ్మ రథ చక్రానికి ఆనుకొని కూచుంది విషాద మూర్తిలా. వీరముని మనస్సు మగతలో గతాన్ని నెమరు వేస్తూ వుంది.

* * *

పట్టణం పెద్దది. వీధులు వెడల్పాటివి. మిద్దెలు, మేడలు విశాలమైనవి. కాని నిలవటానికి నీడలేదు. నడుంవాల్చి కూచోవటానికి స్థలంలేదు. ఊరు ఎంత పెద్దదైతే తల దాచుకొనే స్థలం అంత ఇరుకై పోతుందేమో మరి! మర యంత్రాలా, కీలుబొమ్మల్లా కదిలే మనుషులు. దయాదాక్షిణ్యాల నీడలు వీవరి కళ్ళలోను కన్పడ లేదు. ఆతురత, అహం, అవహేళన నిండుగవున్న మనుషులు. వీరముని పల్లె వదలినప్పుడు అతన్ని ప్రియంగా పిలిచి నట్టింట పీట వేస్తుందనుకోలేదు. కానీ, మరీ యింత దారుణంగా వుంటుందని వూహించలేదు.

పల్లెలు మారిపోయాయి. ఎలా? ప్రశాంతి చెదిరిపోతూ వుంది. జాలిగుండె

గిన్నెలు ముంత సుగాకుడు, పాతకోకవున్న మూటతో చంకన చినకొడుకుతో వెంట నడిచింది భార్య. పొద్దు తిరిగే వేళ పట్టణం చేరుకొన్నారు ఎక్కడా తలదాచుకునే నీడ దొరకలేదు అన్ని చెప్పుల షాపులదగ్గర అడిగిచూశాడు పనేమైనా దొరుకుతుందేమోనని. షాపులవాళ్ళు అతని వాలకం, వెంట సంసారం చూసి నిలవనివ్వలేదు. సాయంత్రానికి వీరముని సంసారం కోనేటి గట్టు చేరారు. పిల్లలు వేళ్ళు తెగిన తోటకూర కాడలా వాడిపోయారు ఆకలికి పిల్లల ముఖం చూడలేక తల దించుకొన్నాడు వీరముని. మునెమ్మ పాతచీర ముడులు విప్పి రూపాయ చేతికిచ్చింది. బాగా నలిగిపోయింది రూపాయ కాగితం మారుతుందో, మారదో అన్న సందేహంతో రైల్వేస్టేషను కెళ్ళాడు. రెండు పాకెట్ల అన్నం తెచ్చాడు. పులుసు అన్నం పాచిపోయింది. మజ్జిగ అన్నం పిల్లలకు పెట్టి భార్యాభర్తలు కోనేటి నీటితో కడుపు నింపుకొన్నారు. మసకచీకటి పడుతూ వుంది. విసురుగాలి పెట్టే వాతలకు పిల్లలు తట్టుకోలేక దగ్గరవున్న రథం చాటుకు వెళ్ళారు మునెమ్మ పాతకోక పర్చి రథం క్రింద పిల్లలను పడుకోబెట్టింది. వీరముని రథచక్రానికి ఆనుకొని కూచున్నాడు. ఏం చేయాలో పాలుపోలేదు. అసహాయత, అశక్తత అతన్ని చుట్టివేశాయి. దుఃఖం ముంచుకొచ్చింది. నవ్వుకొన్నాడు. నవ్వుకొంటూ నిద్రలోకి జారిపోయాడు. తెల్లవారుజామున, కోనేటి చుట్టూవున్న సీమ బాగి చెట్లమీద కాపురంచేసే పక్షుల సుప్రభాతంతో మేల్కొన్నాడు. సిల్కు జుబ్బా విసిరిన పదిపైసలు పట్టణంలో వీరముని మొదటి సంపాదన.

* * *

పిల్లవాడి కేకతో వీరముని మగతనిద్ర వదిలింది. వళ్ళు జలదరిస్తూ వుంది. మునెమ్మ ఆదుర్దాగా వెళ్ళి చిన్నకొడుకును హృదయానికి హత్తుకొంటూ వుంది. రిక్షావాలా పేట్రేగిపోయి వాగుతున్నాడు.

"బుద్ధి వుండక్కర్లా ? బిడ్డల కంటే సరా ?... నడిబజార్లో తేరగవచ్చిన తేరు నీడలో మీరు కళ్ళు మూసుక పడుకోండి, వాళ్ళు నడిరోడ్డు మీద శాశ్వతంగా కళ్ళు మూసుకొంటారు..."

వీరముని బడలిక తీరలేదు. ఒళ్ళు విరుచుకొని పని సంచి అందుకొన్నాడు ఆ సాయంత్రానికి మరి రెండు రూపాయలు ముట్టాయి. రూపాయకు బియ్యం కొన్నాడు. పావలాకు ఒకసట్టి కొన్నాడు పదిపైసలకు ఉప్పు కొన్నాడు నలభై పైసలు ఇచ్చి కట్టెలు కొన్నాడు కోనేటికట్ట ఆసరాగా రెండు రాళ్ళు పెట్టి పొయ్యి రగిలించింది మునెమ్మ. తీరా ఎసరు పొంగేసరికి ఎండు గోగులా చర్రన కాలిపోయాయి పలుచటి పేళ్ళు. ఉడికీ ఉడకని మెతుకుల గంజిని తలాకొంచెం త్రాగారు నిద్రముంచుకొచ్చింది.

వీరమునికి రోజుకు రెండు మూడు రూపాయల ఆదాయంతో నెల గడిచింది. నెలరోజులలో ఐదు రూపాయలు మిగిల్చాడు. మునెమ్మకు పని లేదు నడివీధి బంధికానా! పైరు నాటగలదు. కలుపు తీయగలదు, కోత కోయగలదు. కాని పట్టణంలో ఏం పని చేయగలదు ? పిల్లల్ని జాగ్రత్తగా రోడ్డుమీదకు పరుగులు తీయకుండా, రకరకాల తినుబండారాల వెంటపడకుండా చూడటమే ముఖ్యమైనపని అయింది.

* * *

"ఎంత ?"

"పదిరూపాయలు."

"పదిరూపాయలా ?"

ఆవులించి వింతగా నోరు తెరిచాడు చెప్పులబేరానికి వచ్చిన మనిషి. వీరముని చూపులు 'ఎక్సరే'ల్లా పెద్దమనిషిని ఫోటో తీసాయి.

"అవును బాబు! ఇలాంటి చెప్పులధర షాపుల్లో విచారించి చూడండి అప్పుడు మీకే అర్థమవుతుంది" నెమ్మదిగానే అన్నాడు వీరముని.

"షాపు చెప్పుల్లా ఉన్నాయా ఇవి ?" పెదవి విరిచాడు పెద మనిషి.

"చూస్తూ అడగటం ఎందుకు ?... మీరు చూసేవి పైమెరుగులు ... నాకు చెప్పుల గట్టితనంకూడా తెలుసు" చెప్పులు విరిచినట్లు వంచి చూపించాడు వీరముని.

"మరో బేరంచెప్పు" ?

"ఖరారు బేరం."

"అలాగంటే ఎలా ?"

"హెచ్చుగాచెప్పి తగ్గించటం అలవాటు లేదు కానీ, బోణీబేరం, పావలా తగ్గించుకోండి"

"ఇంతకూ గట్టిగా వుంటాయంటావా ?"

"నామాట నమ్మకంతో తీసుకెళ్ళండి. గట్టితనంలేకపోతే నా ముఖాన పారెయ్యండి. గట్టితనం వుంటేనే బాబు చెప్పు మన్నిక. పునాది గట్టిగా వుంటేనే గోపురం నిలకడ."

వీరముని వీలైనంత సరళంగా, నెమ్మదిగా మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నాడు ఏపుటలో ఏ పాము వుందో! ఎవరితో గట్టిగా మాట్లాడి పేచీపెట్టి వున్న నీడ నుండి తరుముగొడ్తారో అనే భయం ఒకవైపు అతన్ని పీడిస్తూనే వుంది కాని



### రచయితలకు మనవి

స్థానికంగ వున్న రచయితలు, ఆర్టిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన లంద జేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.

# తేరు

మూసపోసిన మోసంలాంటి సమాజంమీద కోపం అతని అదుపు తప్పుతూ వుంది అతని అసహనం అప్పుడప్పుడా నిప్పు మిణుగురుల్లా బయట పడుతూనే వుంది. మాటల్లో, చూపుల్లో. పేదవాడి కోపం పెదవికి చేటు. 'తన కోపమే తన శత్రువు.' తనశత్రువును అతినేర్పుతో సహనంతో జయిస్తూనే వున్నాడు వీరముని కానీ శత్రుశేషం మిగిలిపోతూనే వుంది

*　　*　　*

ముసురువాన పట్టింది జనసామాన్య మామూలు జీవితం స్తంభించి పోయింది శివ్వునవీచే గాలి వరాలను కదలకుండా బిగించేస్తూ వుంది. జడివాన తుంపర కండళ్లను ముదరగా చుట్టేస్తూ వుంది. ఆరోజు వీరమునికి బేరం బొత్తిగా జరగలేదు కోనేటి గట్టున ఎంత ప్రయత్నించినా పొయ్యి రగలలేదు. పిల్లలు గువ్వల్లా ముడుచుక పోయారు. కడుపులో ఆకలిమంట నాలుకలు కోస్తూ వుంది. ప్రొద్దు ఎంతయిందో తెలియనివేళ. వీరముని జడి వానలో గోతం సంచి గూడగాచేసి తలమీద వేసికొని వెళ్ళి నాలుగు సంగటి ముద్దలు తెచ్చాడు. పులుసు మంచినీళ్ళలా వుంది. సంగటి ముద్దల్లో వడ్ల గింజలు ఉడకలేదు. పిల్లలు రెండు ముద్దలు ఆవురావురని మింగేశారు. చలి ఆకలిని పెంచుతుందేమోమరి! మిగిలిన రెండు ముద్దలు వీరముని, భార్య తిన్నారు. వాన నీటిలో చేతులు కడుక్కున్నారు. చుట్టూ నీరేకాని త్రాగటానికి నీరు లేదు. కోనేటి నీరు మురికయిపోయింది. కొళాయినీరు కైలాస తీర్థం. అది దొరకదు వీరముని లాంటి వారికి.

జడివాన విజృంభించింది. తుఫాను చెలరేగింది. రథచక్రాలు వీధి వెళ్ళువను అడ్డుకుంటున్నాయి. చెప్పులు తడవకుండా మిగిలే జాగాను ఎప్పటికప్పుడు సర్దుబాటు చేస్తున్నాడు వీరముని, యాంత్రికంగా. నలుగురు నాలుగు పక్కాలకు అనుకొని కూమున్నారు. చీకటితెర మరింత దట్టంగా పడింది. పిల్లలు తూగారు. మునెమ్మ కునికిపాట్లు పడింది. గుడి గోపురంమీద విద్యుద్దీపాలు గుడ్డిగా వెలుగుతున్నాయి. ఆరిపోతున్నాయి. కారు చీకటిలో మిణుకర పురుగు వెలుగును తలపింప చేస్తున్నాయి. వాన హోరు వింత సంగీతాన్ని ఆలపిస్తూ వుంది. ఎంత వాన వచ్చినా కోనేరు పొంగలేదు. పారలేదు. తుఫాను ఉధృతంగా వుంది. విసురుగాలి వూపుకు కొండంత రథం కదులుతున్నట్టుంది. రథం కదిలితే?! వీరముని గుండె గుబగుబలాడింది.

(ప్రైవారమే ముగింపు)

డా॥ మహీధర నళినీమోహన్

# సైన్సులో సరదాలు

## నీటిమీద గుండుసూది తేలుతుందా ?

నీటికన్న బరువైన వస్తువులు నీళ్లల్లో వేస్తే మునిగిపోతాయనీ, తేలికైన వస్తువులు వేస్తే తేలతాయనీ మనకందరికీ తెలుసు. దీనినే శాస్త్రీయ పరిభాషలో చెప్పాలంటే నీటికన్న ఎక్కువ సాంద్రతగల వస్తువులు నీటిలో మునిగిపోతాయి. తక్కువ సాంద్రతగల వస్తువులు తేలతాయి. ఈ సంగతి ఆదిమ మానవుడికికూడా తెలుసు.

నీళ్లకన్న గుండుసూది బరువు ఎక్కువ. దానిని నీళ్లల్లో వేస్తే మునిగిపోతుంది టుడుంగున. కాని, అదేగుండుసూదిని నీళ్ల



మీద తేలేటట్టు చేసే గారడీ ఒకటి చూపిస్తాను.

కప్పులో నీళ్ళుపోసి బల్లమీద పెట్టు. పాత న్యూస్‌పేపరులో నుంచి చిన్న కాగితం ముక్క (గుండుసూదికన్నా పెద్దకాగితం ఉండాలి) చింపి, ఆ నీళ్లలో వెయ్యి. ఆ కాగితం నీళ్ళు పీల్చుకుంటుంది కాని వెంటనే మునిగిపోదు. గుండుసూదిని నెమ్మదిగా తేలుతున్న కాగితం ముక్కమీద జారవిడు. అంతే నువ్వుచెయ్యవలసింది. కొద్దిసేపట్లోనే కాగితంముక్క నీళ్లలో మునిగిపోతుంది. గుండుసూది మాత్రం నీళ్లమీద తేలుతూ ఉండిపోతుంది ! (కాగితంముక్క నీళ్లల్లో త్వరగా మునగకపోతే, గుండుసూదికి తగలకుండా మూడు నాలుగు నీటి చుక్కలు వేలితో కాగితం మీద వదిలితే చాలు. త్వరగా మునిగిపోతుంది).

ఈ గమ్మత్తు సరిగ్గా జరగాలంటే గుండుసూది పొడిగా ఉండాలి. నీళ్ళు కదలకూడదు. కప్పునీళ్ళు జిడ్డులేకుండా శుభ్రంగా ఉండాలి.

క్షవరం చేసుకునే బ్లేడు అయితే ఇంతకన్న సులభంగా నీటిమీద తేలుతుంది. కాగితం అవసరంలేకుండా సరాసరి నీళ్లమీదనే, జాగ్రత్తగా జారవిడిస్తే – తేలుతుంది.

గుండుసూది నీళ్ల మీద తేలుతూ ఉండగా ఆ నీళ్లల్లో ఒక్క నూనెబొట్టు వేసినా, చిన్న సబ్బుముక్క వేసినా, గుండుసూది నీళ్లల్లో మునిగిపోతుంది !

ఇంతకీ నీళ్లకన్న బరువైన గుండుసూది నీళ్లమీద తేలడం ఎలా సాధ్యం అయింది ?

ద్రవపదార్థాల ఉపరితలముల మీద ఒక విధమైన ఒత్తిడి పనిచేస్తూ ఉంటుంది. దీనిని "ఉపరితలపు వత్తిడి" (Surface tension) అంటారు. ఉపరితలం మీద ఉన్న ద్రవం తాలూకు అణువులు ద్రవాన్ని విడిచి పైకి పారిపోకుండా ఈ వత్తిడి అడ్డు పడుతూ ఉంటుంది. అందువల్ల ద్రవముల ఉపరితలములమీద కనిపించని బలమైన పొరలాగ ఏర్పడుతుంది. ఈ కనిపించని పొరకి గల బలం వివిధ ద్రవాలకు వివిధంగా ఉంటుంది. ఈ బలమే గుండుసూదిని, బ్లేడుని నీటిమీద తేల్చగలిగింది. జాగ్రత్తగా గమనిస్తే తేలుతూన్న గుండుసూది చుట్టూ నీటి మట్టం ఎత్తుగానూ, సూదిఉన్నచోట మాత్రం మట్టం కాస్త పల్లంగానూ కనిపిస్తుంది. (నీటిమీద సెలోఫేన్ కాగితం పరచి, పైన గుండుసూదిని పెట్టేరా అన్న భ్రమ కలిగిస్తుంది). సూది బరువువల్ల పొర కిందికి దిగిపోయినట్టు ఉంటుంది. సూది బరువు మరీ ఎక్కువైతే ఈ కనిపించని పొర "చిరిగిపోయి" సూది మునిగిపోతుంది. సూదిని నిట నిలువుగా నీళ్లల్లో వదిలితే మునిగిపోతుంది. ఏమంటే సూది మొన ఆనుకున్నంత మేరలో ఉన్న నీటి పొరకి మొత్తం గుండుసూది బరువును ఆపగల శక్తి లేదు.



నూనెముక్కగానీ, సబ్బుముక్కగానీ వేస్తే నీటి ఉపరితలపువత్తిడి తగ్గిపోతుంది. అది సూదిని నిలువబెట్టడానికి సరిపోదు. కనుక సూది మునిగిపోతుంది.





# వంటలు

## మురియా

ఈ వంట గుజరాతీ పిండివంట. చేయటం చాలా తేలిక.

కావలసిన సామగ్రి :— సెనగపిండి, గోధుమపిండి, చెరొక కప్పు కారంపొడి ఒక స్పూను, ధనియా జీలకర్రపొడి ఒక స్పూను, పంచదార ఒక స్పూను, నూనె 200 గ్రా, తగినంత ఉప్పు, బాగుచేసి కాడలులేకుండా సన్నగా తరిగిన మెంతిఆకు లేక సొరకాయ తురుముడు ఒకటిన్నరకప్పు.

పైన చెప్పిన వస్తువులన్నీ బేసిన్‌లో బాగా కలిపి నీరుపోస్తూ గట్టిగా పూరీపిండి మాదిరి తడపాలి. చేతికి నూనె రాసుకొని రూపాయిబిళ్ళంత సైజులో, అరంగుళం మందం ఉండేట్లు, మురియా పిండినంతా ముందుగా తయారుచేసుకోవాలి. యిడ్లీ సెట్టులో(సెట్టుకి ముందుగా నూనెరాసి) అమర్చి కుక్కర్‌లో పెట్టి పది నిముషాలసేపు ఉడకబెట్టాలి. తర్వాత కుక్కర్ దించి, కొంచెం చల్లారిన తర్వాత మురియాలు విడివిడిగా ప్లేటులోకి తీసుకోవాలి. యిప్పుడు పొయ్యిమీద బాణలి పెట్టి, అందులో నూనెపోసి, నూనె కాగిన తర్వాత మురియాలు ఒకోతడవకు నాలుగైదు కాప్పున బాణలిలో వేస్తూ, ఎర్రగా కాలిన తర్వాత తీసివేయాలి.

ఈ మురియాలతో పచ్చడి నంజుకొని కాని, లేక, పైన నిమ్మకాయ పిండుకొని కాని తినవచ్చు. ఈ వంటకము వేడిగా తింటే బాగుంటుంది. మెంతాకు బదులు సొరకాయ తురుముడు వేసి చేసుకోవచ్చు. అన్నం సెనగపిండితోనైనా లేక మిగిలిపోయిన అన్నంవుంటే అది పిండికి బదులువాడి, మిగతాదంతా మామూలుగా మెంతాకు కలిపి మురియాలు తయారు చెయ్యవచ్చు. ఈ వంట, నూనె ఎక్కువగా పీల్చదు.

—పద్మినీపాలూర్.

## పనసకాయ ఆవకాయ

కావలసిన వస్తువులు :— బాగా ముదిరిన పనసకాయ ఒకటి, ఆవగుండ పావు, ఉప్పు గుండ పావు, మిరపగుండ పావు, ఇంగువ అర తులం, పసుపుగుండ చెటాకు, నువ్వుల నూనె ఒక కిలో, పుల్లని మామిడికాయలు 8.

తయారుచేయువిధము:— పనసకాయపై తొక్క చెక్కి కూరకువలెనే సన్నని పొట్టు కొట్టాలి. ఆపొట్టు తడిలేకుండా బట్టపై ఆరనివ్వాలి. మామిడికాయలు పైతొక్క తీసి సన్నగా తురుముకోవాలి. పనసపొట్టు మామిడితురుము పసుపువేసి కలపాలి. ఆవ గుండ, ఉప్పుగుండ, మిరపగుండ యీ మూడుకలిపి ఇంగువ నూనె మరిగించి కలపాలి. ఈ మిశ్రమంలో పనసపొట్టు మామిడితురుము కలిపినదానితో బాగా కలియబెట్టాలి. తరువాత జాడీలో 2, 3 రోజులు ఊరనిచ్చి అడుగునుంచి కలపాలి. వారం దినములు ఊరిన తరువాత జాడీతోసి నాలుగు రోజులు ఎండబెట్టాలి. బాగ ఎండిన తరువాత నూనెవేసి కలిపితే నిల్వవుంటుంది. పనసకాయ లేతది పనికిరాదు. ఈ ఆవకాయ 6 నెలలవరకు నిల్వవుంటుంది.

— శ్రీమతి రమణాప్రకాష్

## పాల లడ్డూ

కావలసినవి:— బొంబాయిరవ్వ అరకేజి పంచదార—అర కేజి, పాలు—పావు లీటర్లు 50 గ్రా. కిస్‌మిస్. యాలక పొడి.

తయారుచేయువిధము:—రవ్వను బాగు చేసి డాల్డాలో కమ్మనివాసన వచ్చేవరకు వేయించాలి. పంచదారలో పచ్చిపాలు చిక్కనివి పోసి పొయ్యిమీద పెట్టాలి. కొద్దిగా ఉండ పాకము రానిచ్చి అందులో రవ్వపోసి యాలక పొడివేసి తిప్పాలి. వీటిని వేడి మీద లడ్డూ చుట్టి కిస్‌మిస్ అంటించాలి. ఇష్టమున్న వారు పచ్చకర్పూరం వేసుకొనవచ్చును.

కొడాలి శైలాకుమారి

## తెనాలిలో కార్టూన్ల ప్రదర్శన

తెనాలిలో (ఇటీవల ఫిబ్రవరి 3, 4 తేదీలలో)రాష్ట్రస్థాయి కార్టూన్ల ప్రదర్శన తెనాలి కార్టూనిస్టుల సహకారంతో నిర్వహించబడింది. ఈ పోటీలలో ప్రథమ బహుమతి 'మారుతి'కి, ద్వితీయ బహుమతి 'అరుణ్'కి, తృతీయ బహుమతి 'చుక్కా శివ'కు, కన్సొలేషన్ బహుమతి 'వీరమల్లు'కు లభించాయి. వీటిని శ్రీ 'బాలి' అందచేశారు. బహుమతులు లభించినవారికి 'సౌజన్యసాహితి' తరఫున వి. డి. సౌజన్య కథల సంపుటాలను అందజేశారు. మొత్తం 50 మంది కార్టూనిస్టులకు సర్టిఫికెట్లు అందజేయబడ్డాయి.

చివరిరోజు ప్రముఖ కార్టూనిస్టు




'శ్రీనివాస్' కార్టూనిస్టులపై పాటలు పాడి అందరినీ కడుపుబ్బ నవ్వించారు. ప్రదర్శనలో 600 కార్టూన్లు చోటుచేసుకొన్నాయి.

## శ్రీమద్రామాయణము

శ్రీమద్రామాయణం (బాలకాండము) ఆంధ్ర తాత్పర్య సహితంగా మొత్తం 470 పుటలు గ్రంథంగా శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్సు వారు ప్రకటించారు. తాత్పర్య కర్త శ్రీమాన్ ఉప్పుమేచర్ల వేంకట శేషాచార్యులు. విడి ప్రతి (బైండు) వెల 16 రూపాయలు. ప్రతులకు ప్రచురణ కర్తల పేరు [illegible], శ్రీ[illegible] హైదరాబాదు — 500 873 వ్రాయాలి

## నవ ఉపన్యాసాలు

శ్రీ డి. వి. [illegible]రావు కవితల ఎంపిక [illegible] ఉపన్యాసాలు మా కార్యాలయం చేరింది. 48 పుటలు, వెల 2 రూ లు. ప్రతులకు ప్రమాణ[illegible] రేడియో హౌస్, గోపాలరెడ్డి రోడ్, [illegible]పేట, విజయవాడ—2 కి వ్రాయాలి.

## ప్రేమామృతము

[illegible] చింతామలింగేశ్వరరావు రచన ప్రేమామృతము 74 పుటల గ్రంథం మా కార్యాలయం చేరింది. వెల 3 రూపాయలు. ప్రతులకై డా. ఎస్. పి. ఆర్. రావు, తణుకు (ప. గో. జిల్లా) అన్న చిరునామాకి వ్రాయాలి.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# చూపుకి
# అందం
# కంటికి
# చలవ
# అదే
# ఐటెక్స్
# కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనం గాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033